# ఆంధ్ర ప్రదేశ్



సమాచార, పౌరసంబంధముల శాఖ ; ఆంధ్ర ప్రదేశ్.


Registered No. H-373.

సంపుటి 3 నవంబర్, 1958—అగ్రహాయణ, శాలివాహనశకము-1880 సంచిక 1

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడినది.



27-10-58 న పండిత్ నెహ్రూ బేగంపేట విమానాశ్రయంవద్ద రాష్ట్ర మంత్రులు మున్నగువారివద్ద సెలవు తీసుకుంటున్న దృశ్యం.



రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన సచార్ 7-10-58 న హైదరాబాదు నగరానికి మాస్టర్ ప్లాన్ పథకాన్ని ప్రారంభించారు.



# ఆంధ్రప్రదేశ్

నవంబర్, 1958.

సంపుటి 3 — సంచిక 1

ఆగ్రహాయణ, శాలివాహనశకము-1880

## విషయసూచిక



## ముఖచిత్రం

ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ 25-10-58 న [illegible] వర్సిటీ [illegible]శాలలో అంబర్ చర్ఖా ప్రదర్శనను తిలకించారు

— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయలు 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్ ప్రెస్‌లో ముద్రింపబడినది.



కృష్ణా బారేజ్

# రెండు సంవత్సరాల అభివృద్ధి

ఆంధ్రప్రదేశ్ ఏర్పడి రెండు సంవత్సరాలు అయింది. అది భారతదేశంలోని [illegible] పెద్ద రాష్ట్రాలలో నాలుగవది. దాని జనసంఖ్య 310 లక్షలు మించివుంది. [illegible] దానికి మొదటినుంచి పరిష్కారం కావలసిన పెద్ద సమస్యలు కొన్ని వున్నాయి, కాని, వాటిని ఒకట తరువాత ఒకట జయింపడమే కాక కొన్ని పెద్దపనులను సాధించడంకూడా జరిగింది. పూర్తిగా ప్రశాంతమైన పరిస్థితులలో అన్ని నిర్మాణ కార్యక్రమాలలోను ప్రజలు హెచ్చుగా సహకరిస్తున్నారు, ఇందువల్ల సమాజాభివృద్ధివంటి కొన్ని రంగాలలో అద్భుతమైన అభివృద్ధి సాధించబడింది. ఆహారోత్పత్తి హెచ్చుతున్నది. అలాగే బొగ్గు ఉత్పత్తికూడా. నిర్మాణంలో వున్న భారీ, మధ్యరకం ప్రాజెక్టుల పని చక్కగా కొనసాగుతున్నది. ఇదివరకే పూర్తి చేయబడినవాటిలో కృష్ణా బ్యారేజ్, తుంగభద్ర దిగువ కాలువ, నాగార్జున సాగర్ వద్ద రోడ్డు బ్రిడ్జి, నల్గొండ జిల్లాలోని పాలేరు వంతెన మున్నగునవి వున్నాయి. సాధించిన పెద్ద పనులలో కర్నూలు వైద్య కళాశాల స్థాపన ఒకటి. ఆరకం కళాశాలలు యింకా రాష్ట్రం వేర్వేరు ప్రాంతాలలో నెలకొల్పబడుతున్నాయి. విద్యా సంస్థల ప్రారంభం, ప్రజారోగ్య సౌకర్యాల కల్పనలో కూడా గమనార్హమైన అభివృద్ధి కనబడుతున్నది.

1958-59 కి రూ 63 66 కోట్ల ఆదాయం అంచనాతో రూ 62.87 కోట్ల వ్యయంతో రాష్ట్రానికి మిగులు బడ్జెటు రూపొందించబడింది. ఇటీవల ప్రభుత్వం కోరిన 5 కోట్ల అప్పు నిమిషాలమీద వసూలు అయింది. ప్రజలకు ప్రభుత్వ ఆర్థిక సౌష్ఠవం పట్ల విశ్వాసం కలదనుటకు ఇది ప్రబల నిదర్శనం. తక్కువ జీతాల ప్రభుత్వోద్యోగులు, కార్మికుల

కోర్కెల కనుగుణంగా ప్రభుత్వం యిదివరకే ప్రకటించిన నిర్ణయాల ఫలితంగా ప్రభుత్వ వ్యయం యేటా రూ. 2-1/2 కోట్లను మించి హెచ్చుతుంది.

## ద్వితీయ ప్రణాళిక

అఖిలభారత రంగంలో అభివృద్ధితో పోల్చినప్పుడు మన రాష్ట్రంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద పని చాలా చక్కగా జరిగినదని చెప్పాలి. ప్రణాళిక మొత్తం కేటాయింపు రూ. 175.74 కోట్లలోను యించుమించు రూ. 84 కోట్లవరకూ యీ సంవత్సరం ఆఖరునాటికి ఖర్చు పెట్టబడగలదని భావించబడుతున్నది. ప్రణాళిక తొలి రెండు సంవత్సరాలలోను ఆంధ్రప్రాంతంలో రూ. 39.8 కోట్లు, తెలంగాణా ప్రాంతంలో రూ. 13.8 కోట్లు ఖర్చు చేయబడినవి. పై రెండు ప్రాంతాలకు కేటాయించబడిన సొమ్ము వరుసగా రూ. 46.7 కోట్లు, రూ. 20.6 కోట్లు అయివున్నది. తెలంగాణాలో వెనుకబడిన ఖర్చును భర్తీచేయుటకై ఆ ప్రాంతంలో జరిగే సంవత్సరంలో ప్రణాళికా వ్యయంలో రూ. 3 కోట్లు హెచ్చించబడినవి.

1956-57 లో యావదాంధ్రలోను ప్రణాళికా పథకాలపై నిర్ణీతమైన ఖర్చులో 100 కి 75 వంతులు ఖర్చు పెట్ట బడినట్లు తేలింది. 1957-58 లో యీ పరిస్థితి మెరుగయి 100 కి 82.3 వంతులు ఖర్చు అయ్యేలా కనబడు తున్నది. ప్రణాళిక తొలి రెండు సంవత్సరాలలోను యీ పథకాలపై మొత్తం మీద 100 కి 78.2 వంతులు ఖర్చు అయింది.

## భూసంస్కరణలు

వ్యవసాయ భూముల కమతాలకు గరిష్ఠ ప్రమాణం నిర్ణయించుటలో గల వివిధ విషయాలను జాగ్రత్తగా పరిశీలించిన మీదట ఆ విషయంలో శాసన సభలో ఒక బిల్లు ప్రవేశ పెట్ట బడింది. ఆ ప్రతిపాదనలు ప్లానింగు కమిషన్ ఆమోదాన్ని పొందాయి. భూస్వామ్యంలో గల వ్యత్యాసాలను తొలగించి, తద్వారా భూమి తీవ్ర సాగును, హెచ్చు వుత్పత్తిని ప్రోత్సహించుట యీ బిల్లు ఆశయం. రాష్ట్రం వివిధ ప్రాంతాలలో భూమి శిస్తు మదింపులు (అసెస్‌మెంట్లు), నీటి పారుదల ఛార్జీలకు సంబంధించిన సమస్యల పరిశీలనకై ఒక కమిటీ కూడా యేర్పరచ బడింది.

## నీటి పారుదల

రాష్ట్రానికి గర్వకారణమైన నాగార్జునసాగర్ ప్రాజెక్టు-ఆనకట్ట, కాలువలు రెండింటి పని కూడా స్థిరంగా పురోగమిస్తున్నది. తొలి ప్రణాళిక కాలంలో, ప్రారంభింపబడిన పెక్కు నీటి పారుదల పథకాలు పూర్తి చేయబడినవి. తక్కినవి పూర్తి చేయ బడు తు న్న వి. వీ టి లో కృష్ణా, బ్యారేజ్, తుంగభద్ర దిగువ కాలువ, రొంపేరు ప్రాజెక్టు, భైరవాని తిప్ప ప్రాజెక్టు, యెగువ పెన్నారు ప్రాజెక్టు, రాళ్ళపాడు ప్రాజెక్టు వున్నాయి. తుంగభద్ర యెగువ కాలవ పథకం ప్రాథమిక పనులు చేపట్ట బడినవి. మైసూరు ప్రభుత్వంతో సమాలోచించి రాజోలిబండ మళ్లింపు పథకాన్ని త్వరగా పూర్తి చేయుటకు చర్య తీసుకొన బడుతున్నది. మూసీ ప్రాజెక్టు పని ముమ్మరంగా జరుగుతున్నది. ఇటీవల వరదల వల్ల తీవ్రంగా దెబ్బ తిన్న కడం ఆనకట్ట విషయం పరిశీలించుటకై ఒక కమిటీ నియమింప బడవలసి వుంది. పోచంపాడు, వంశధారా ప్రాజెక్టుల పరిశోధన త్వరలోనే పూర్తి కావచ్చు. గండిపడిన చెరువుల బాగుకి, యితర చిన్న రకం నీటి పారుదల పథకాల అమలుకి తగిన వసతి కల్పించ బడింది.

ఆయకట్లను శీఘ్రంగా అభివృద్ధి పరచే పని రెవిన్యూబోర్డు సభ్యులలో ఒకరికి అప్పగించబడింది. ఆంధ్రప్రాంతపు నీటి పారుదల అభివృద్ధి బోర్డు అధికారం మొత్తం రాష్ట్రానికంతకి విస్తరింప చేయబడింది.

## వరద నివారణ

ప్రస్తుతం యించుమించు 20 వరద నివారణ పథకాలు అమలులో వున్నాయి. వాటిలో మరీ ముఖ్యమైనవి యివి. బుడమేరు మళ్ళింపు పథకం, తూర్పు తుంగభద్ర మురుగు పారుదల పథకం, సీతానగరం నుంచి వైకుంఠపురానికి వరదగట్లు,



ఆంధ్రప్రదేశ్ అవతరణ రెండవ వార్షికోత్సవ సందర్భంలో 1-11-58 న హైదరాబాదులో యేర్పాటు చేయబడిన ఫుట్‌బాల్ పందెములో పాల్గొన్నవారు.

బుడమేరు వరదగట్ల పథకాలు, యేనుగుపల్లి వరద గట్టు 2/4 నుంచి వైనతేయం యెడమ వరదగట్టు 5/4-5 మై. వరకూ వరదగట్టు నిర్మాణం. కేంద్ర ప్రభుత్వాన్ని అడిగిన అప్పు మంజూరయే పక్షంలో పై పథకాలు 1959 ఆఖరునాటికి పూర్తికాగలవని భావించబడు తున్నది

తెలంగాణాలో వరదలవల్ల దెబ్బతినే గ్రామాల వివరాలు సేకరించబడు తున్నాయి అవసరమైన చోటల్లా వరదగట్లు నిర్మించబడగలవు

## విద్యుచ్ఛక్తి

విద్యుచ్ఛక్తి అభివృద్ధి విషయంలో ఆంధ్రప్రదేశ్ యేర్పడిన తొలి సంవత్సరంలో సాధించిన స్థాయి రెండవ సంవత్సరంలో కూడా నిలపబడింది

మచ్‌ఖండ్ జలవిద్యుచ్ఛక్తి పథకం క్రింద 4 వ, 5 వ, 6 వ, యూనిట్లకు పెన్‌స్టాక్ పైపుల స్థాపన పూర్తి చేయబడింది ఒక్కొక్కటి 21,250 కె వా శక్తిగల యీ యూనిట్ల స్థాపనపని బాగా కొనసాగు తున్నది. 4 వ, 5 వ., 6 వ., వుత్పత్తి యూనిట్లు 1958-59 ఆఖరుకు పని ప్రారంభించ గలవని భావించబడు తున్నది

హంపి విద్యుదుత్పత్తి కేంద్రంలో ఒక్కొక్కటి 9000 కె. వా. శక్తిగల రెండు యంత్రాలు పని ప్రారంభించాయి రాష్ట్రం యేర్పడిన తొలి సంవత్సరంలో ఆనకట్ట విద్యుదుత్పత్తి కేంద్రంలో పని ప్రారంభించిన రెండు యూనిట్లు (ఒక్కొక్కటి 9000 కె వా. శక్తిగలది) యిప్పుడు రాయలసీమకు విద్యుచ్ఛక్తి నందిస్తున్నవి హంపిలో రెండు యూనిట్లు పని ప్రారంభించుటతో, తుంగభద్ర జల-విద్యుచ్ఛక్తి పథకం తొలిపనులు పూర్తి అయినవి కాకపోతే హంపిలో 3వ. యూనిట్టు పని మిగిలిపోయింది అది రెండవ అంచె యంత్రాలతో పాటు తెప్పించి స్థాపించబడుతున్నది.

తుంగభద్ర జల-విద్యుచ్ఛక్తి పథకం రెండవ అంచెపనులు విదేశ ద్రవ్యం విడుదల అయినప్పుడు చేపట్టబడతాయి. ఇందులో ఒక్కొక్కటి 9000

కె. వా. శక్తిగల యూనిట్లు మూడు, రెండు ఆనకట్ట విద్యుదుత్పత్తి కేంద్రంలోను, ఒకటి హాంపి విద్యుదుత్పత్తి కేంద్రంలోను వుంటాయి,

31-10-58 నాటికి ఆంధ్ర ప్రాంతంలో అదనంగా 220 గ్రామాలకి, పట్టణాలకి విద్యుచ్ఛక్తి లభిస్తుంది. విద్యుచ్ఛక్తి లభించే గ్రామాలు, పట్టణాల సంఖ్య 1057 నుండి 1280కి హెచ్చింది.

గరివిడిలోని ఫెర్రోమాంగనీసు ఫ్యాక్టరీకి కొంతవరకూ విద్యుచ్ఛక్తి లభింపచేయ బడుతున్నది. రాష్ట్రం ఏర్పడిన తొలి సంవత్సరంలోనే కాల్టెక్సు ఆయిల్ రిఫైనరీ, విశాఖపట్నం, కృష్ణా సిమెంటు ఫ్యాక్టరీ, మాచెర్లలోని మంగళగిరి సిమెంటుఫ్యాక్టరీ మున్నగువాటికి కూడా కొంతవరకూ బల్కులోడ్సు సరఫరా చేయబడినవి. ముచ్‌ఖండ్ రెండవదశ పనులు పూర్తియైనాక విశాఖపట్నం వాటికి పూర్తి సరఫరా అందించబడుతుంది.

తెలంగాణాలో రామగుండం సిర్పూరు 66 కె.వి. ట్రాన్స్‌ఫర్ ఫీడరు, రామగుండం-వరంగల్లు 66 కె.వి. లైను పూర్తి చేయబడినవి. బెల్లంపల్లి బొగ్గుగనులకు కొంతవరకూ విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతున్నది. సిర్పూరులో కాగితంమిల్లులు, మాచెర్లలో సిమెంటు ఫ్యాక్టరీ, సిర్పూరులో బట్టల మిల్లులు మున్నగు వాటికి బల్కులోడుల సప్లైకై ఏర్పాట్లు చేయబడుతున్నవి. రామగుండం-హైదరాబాదు 66 కె. వి. లైను కూడా 31-10-1958 నాటికి పూర్తికాగలదు. ఈ మార్గంద్వారా జంట నగరాలకు రామగుండం విద్యుదుత్పత్తి కేంద్రం నుండి యింకను మించి 5000 కి.వా. విద్యుచ్ఛక్తి సరఫరా కాగలదు.

ఎక్కువవుతుంటి వాడకం నాగులకు సరఫరా చేయుటకై హైదరాబాదు, సికిందరాబాదు నగరాల లోని విద్యుచ్ఛక్తి సరఫరా వ్యవస్థ పునర్వ్యవస్థీకరింప బడుతున్నది. అసెంబ్లీ - [illegible] - [illegible] 33 కె. వి. ప్రధానకేంద్రం [illegible], అఫ్జల్ గంజ్ ప్రాంతంలో 33 [illegible] 6.6 కె. వి. [illegible] పూర్తి అయింది.



నాగార్జున విశ్వవిద్యాలయ స్థలమును కేంద్ర ప్రణాళికా మంత్రి శ్రీ జి. యల్. నందా పరిశీలిస్తున్నారు.

తెలంగాణా ప్రాంతంలో 31-10-58 నాటికి అదనంగా 130 పట్టణాలు, పల్లెలకు పైగా విద్యుచ్ఛక్తి లభిస్తుంది. 1-11-57 నుంచి 31-10-58 నాటికి విద్యుచ్ఛక్తి పొందే పల్లెలు, పట్టణాల సంఖ్య 26 నుంచి యించుమించు 160కి హెచ్చింది.

## ఆహారోత్పత్తి

ద్వితీయ ప్రణాళిక ప్రారంభం నాటికి ఆంధ్ర ప్రదేశ్‌లో సుమారు మొత్తం 54.21 లక్షల టన్నుల ఆహారం వుత్పత్తి అవుతున్నది. ద్వితీయ ప్రణాళిక ఆఖరునాటికి దానిని 70.64 లక్షల టన్నులకు హెచ్చించాలని సంకల్పించబడింది. అంటే 100కి 30.3 వంతులు యెక్కువ అన్నమాట. క్రిందటి యేడాది 2.08 లక్షల టన్నులు యెక్కువ పండించబడ్డాయి. ఈ సంవత్సరం 5.39 లక్షల టన్నుల్ని అదనంగా పండించాలని సంకల్పించబడింది. తీవ్ర ఆహారోత్పత్తి వుద్యమం, యితర చర్యలు తీసుకొనబడుతున్నాయి. కర్నూలు-కడప కాలువ ప్రాంతం, రాజోలిబండ పథకాలలో ఆయకట్టు అభివృద్ధికై కేంద్ర ప్రభుత్వం నుంచి అదనంగా కొంత సొమ్ము లభించడంతో మరికొంత హెచ్చుదలను సాధించవచ్చునని ఆశించబడుతున్నది.

## అడవులు

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అటవీశాఖ పథకాలు మొత్తం 31 వున్నాయి. వీటిలో 30 పథకాలు అడవులకు, ఒకటి భూసారపరిరక్షణకు సంబంధించినవి. 1-11-56 – 31-8-58 మధ్య యీ 31 పథకాలలో 8 ఆంధ్ర ప్రాంతంలోను, 14 తెలంగాణా ప్రాంతంలోను అమలు పరచబడినవి. అందుకు రూ. 16.28 లక్షలు ఖర్చు అయినది.

(ఇ) కాక యీ కాలంలో చెందుల సంక్షేమ పథకాలు; కేంద్రం తలపెట్టిన పథకాలు, జీడిమామిడి తోటల పథకాలు అమలు పరచబడినవి.

అ. వర్కింగుప్లాన్స్: ఈ కాలంలో 4 సందర్భాలలోను ఒక్కొక్క దానిలో మూడింటింటిని పూర్తి చేయబడింది. సర్వే, డిమార్కేషన్ పనులు పురోగమించేట్టు చూడబడింది కూడా.

ఆ. చెట్లు నాటుట.

| | ఆంధ్ర ఎకరాలు | తెలంగాణా ఎకరాలు | మొత్తం ఎకరాలు | నిర్వాహణ ఎకరాలు |
|---|---|---|---|---|
| 1. నదీ తీరాలు | 68 | —— | 68 | 315 |
| 2. సంగీతం చెట్లు | 1079 | —— | 1079 | 539 |
| 3. బాగు | 1845 | 1225 | 3070 | 975 |
| 4. అడవులు | 140 | 5345 | 5485 | 95 |
| 5. అగ్గిపుల్లల చెట్లు | —— | 125 | 125 | 125 |
| | 3132 | 6695 | 9827 | ఆంధ్రలో, తెలంగాణాలో 156 ఎక. |

ఈ చెట్లు నాటు పథకాలకు తోడుఅటవీ పరిశోధన, ప్రచారం, ప్రచురణ కార్యక్రమం జరుపబడుతున్నవి. ఒక పరిశోధన కేంద్రం వెలకొల్పబడి నిర్వహించబడుతున్నది. "లక్క సాగు" క్రింద 500 మణుగుల లక్క తీయబడింది. ఆంధ్ర ప్రాంతం మైదానాలు, యేజన్సీ ప్రాంతాలలో యించుమించు 61 మైళ్ల పొడుగు రోడ్లు నిర్మించబడినవి. క్రెయిలర్లు గల రెండు లారీలు కొని జిల్లా అటవీ అధికారులకు యివ్వబడినవి. చెట్లు నాటే ప్రాంతాలకు మొక్కలను, కొమ్మలను సరఫరా చేయుటకై 13 నారు పెంపకం యూనిట్లు ప్రారంభింపబడినవి. 3 వేట జంతువుల రక్షణ స్థావరాలు యేర్పాటు చేయబడినవి. ఆదిలాబాదు జిల్లాలో ఒక రక్షణ స్థావరం ప్రారంభింపబడింది. చీఫ్ కన్సర్వేటరు కార్యాలయ భవనం

నిర్మాణం యిప్పుడిప్పుడే చేపట్ట బడింది. ప్రణాళిక పనులు అమలుకై అదనపు కార్య నిర్వాహక, మినిస్టీరియల్ సిబ్బంది నియమించబడింది.

కర్నూలు జిల్లాలో గిరిజనుల సంక్షేమానికి మామూలుగా జరిగేపనికి తోడు యీ కాలంలో 3 గిరిజన సంక్షేమ పథకాలు చేపట్టబడినవి. ఇందుపై రూ. 2.39 లక్షలు ఖర్చు చేయబడినవి;

### దిగువ లక్ష్యాలు సాధించ బడినవి :

1. 22 పాఠశాలలు, ఒక ఆస్పత్రి, ఒక సహకార సంఘం నిర్వహణ.
2. ఒక సంచార వైద్య యూనిట్టు ప్రారంభం.
3. చెంచు పనులను చూచుటకై ప్రత్యేక సిబ్బంది నియామకం.

కేంద్రం తలపెట్టిన రెండు పథకాలు చేపట్ట బడినవి. ఆ కాలంలో రూ 2.23 లక్షలు ఖర్చుపెట్ట బడినవి.

శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల్లో 87 మైళ్లని డివిగల బ్రిడిల్ మార్గాలు నిర్మింప బడ్డాయి. కర్నూలు జిల్లాలో నాగలూటీ, బైర్లూటీలలో చెంచు కాలనీలు యేర్పాటు చేయబడు తున్నాయి.

ఈ కాలంలో ఆంధ్రప్రాంతం కోస్తా జిల్లాల్లో 13,797 యెకరాలలో జీడిమామిడి మొక్కలు నాటబడినవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో లేని పథకం క్రింద యిందుకు రూ 3.04 లక్షలు ఖర్చు చేయ బడినవి.

## విద్య

### ప్రాథమిక విద్య (6-11 సంవత్సరాల మధ్య వయస్కులకు)

తొలి ప్రణాళిక సమాప్తి నాటికి ఆంధ్రప్రాంతంలో పాఠశాలల్లో చదువుకునే 6-11 సంవత్సరాల మధ్య వయస్కులైన పిల్లల శాతం 54.7 ను ద్వితీయ ప్రణాళిక సమాప్తి నాటికి 58.2 శాతానికి పెంచించాలని ప్రాథమిక విద్య క్రింద లక్ష్యం నిర్ణయించ బడింది. తెలంగాణా ప్రాంతంలో దీనిని 27.7 శాతం నుంచి 37.3 శాతానికి పెచ్చించాలని నిర్ణయం జరిగింది.

ఆంధ్ర ప్రాంతంలో పై లక్ష్యాన్ని సాధించుటకై 1957-58 లో 200 జూనియర్ పాఠశాలలు, 210 మామూలు ప్రాథమిక పాఠశాలలు తెరువ బడినవి. వాటికి అవసరమైన పరికరాలు మున్నగునవి సమకూర్చ బడినవి. తెలంగాణా ప్రాంతంలో 362 కొత్త ప్రాథమిక పాఠశాలలు తెరువ బడినవి. 386 స్వచ్ఛంద సహాయ పాఠశాలలు ప్రభుత్వ పాఠశాలలుగా మార్చబడినవి. 418 మంది ఉపాధ్యాయులు అదనంగా నియమింప బడ్డారు. వారికి అవసరమైన కుర్చీలు, బల్లలు వగైరా సరఫరా చేయబడినవి.

ఆ పైన, ప్రాథమిక పాఠశాలల్లో విద్యా ప్రమాణాన్ని పెంపొందించాలన్న ప్రభుత్వ విధానాన్ని అనుసరించి, ఆంధ్రప్రాంతంలో 500, తెలంగాణా ప్రాంతంలో 122 ప్రాథమిక పాఠశాలలు వృత్తి విద్యా పాఠశాలలుగా మార్చబడినవి.

పల్లె ప్రాంతాలలో విద్యావసరాలను గురించి తెలుసుకొనుటకై కేంద్ర ప్రభుత్వం నాయకత్వం క్రింద ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు రెండిటిలోను దేశ వ్యాప్తమైన సర్వే జరుపబడింది.

ప్రీ-ప్రైమరీ విద్య విషయంలో కూడా కొంత శ్రద్ధ గైకొనబడింది. ఆంధ్రప్రాంతంలో 4 ప్రీ-ప్రైమరీ పాఠశాలలు తెరువబడినవి. వాటిలో 1 ఎయిడెడ్ పాఠశాల, 3 ప్రభుత్వ పాఠశాలలు. తెలంగాణా ప్రాంతంలో 8 ప్రీ-ప్రైమరీ పాఠశాలలకు మాంటిస్సోరీ, కిండర్‌గార్డెన్ పరికరాలు సరఫరా చేయబడినవి. ఆంధ్రప్రాంతంలో పెంటపాడులో ప్రీ-ప్రైమరీ పాఠశాల-ఉపాధ్యాయుల శిక్షణకై ప్రభుత్వ శిక్షణా పాఠశాల కూడా ఒకటి నెలకొల్పబడింది.

### ప్రాథమిక విద్య (11-14 సంవత్సరాల మధ్య వయస్కులకు)

తొలి ప్రణాళిక సమాప్తి నాటికి ఆంధ్ర ప్రాంతంలో 11-14 సంవత్సరాల మధ్య వయస్సులో వుండి

చదువుకునే పిల్లల శాతాన్ని 26.3 నుంచి ద్వితీయ ప్రణాళిక సమాప్తినాటికి 29.6 శాతానికి పెంచ్చాలనీ, తెలంగాణా ప్రాంతంలో దానిని 13.2 శాతంనుంచి 15.2 శాతానికి పెంచ్చించాలనీ లక్ష్యం నిర్ణయించబడింది.

ఇందునిమిత్తం, ఆంధ్రప్రాంతంలో వివిధ నిర్వహణాధికారాలక్రింద 35 కొత్త మాధ్యమిక పాఠశాలలు (వీటిలో 3 ఓరియంటల్ పాఠశాలలు), 117 అదనపు సెక్షన్లు ప్రారంభింపబడినవి. వీటిలో ఓరియంటల్ పాఠశాలల్లోని 14 సెక్షన్లు కూడా చేరివున్నాయి. 18 హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలు మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడినవి. అదనపు సెక్షన్లు ప్రారంభించబడిన పాఠశాలలకు అవసరమైన కుర్చీలు, బల్లలు, బోధనాసామగ్రి మున్నగునవి సరఫరా చేయబడినవి. అర్హులైన వుపాధ్యాయులు కూడా నియమించబడ్డారు. తెలంగాణా ప్రాంతంలో 120 పాఠశాలల్లో పై తరగతులు అనగా 1,2,3 ఫారాలకు సమానమైన 5,6,7 తరగతులు ప్రారంభింపబడినవి. ఈ తరగతులన్నిటికి మొత్తం 157 మంది వుపాధ్యాయులు అదనంగా నియమింపబడ్డారు. వారికి అవసరమైన పరికరాలు మున్నగునవి సరఫరా చేయబడినవి.

## సెకండరీ విద్య (14-17 సంవత్సరాల మధ్య వయస్కులకు)

ఈ రంగంలో ఆంధ్ర ప్రాంతానికి నిర్ణయించబడిన లక్ష్యం యిది : తొలి ప్రణాళిక సమాప్తినాటికి 14-17 సంవత్సరాల మధ్య వయస్కులై చదువుకుంటున్న పిల్లల శాతం 8.8 ని ద్వితీయ ప్రణాళిక సమాప్తినాటికి 10.2 శాతానికి పెంచ్చించుట. తెలంగాణా ప్రాంతంలో దీనిని 6.5 శాతంనుంచి 7 శాతానికి పెంచ్చించాలని నిర్ణయించబడింది.

ఇందునిమిత్తం ఆంధ్ర ప్రాంతంలో 3 ఎయిడెడ్ పాఠశాలల్లోను, 10 ఓరియంటల్ వున్నత పాఠశాలల్లోను పై ఫారాలు ప్రారంభింపబడినవి. ఓరియంటల్ వున్నత పాఠశాలల్లో అదనపు సెక్షన్లు కూడా ప్రారంభింపబడినవి. 23 వున్నత పాఠశాలలు (6 ప్రభుత్వానివి, 17 లోకల్‌బోర్డు, ఎయిడెడ్ పాఠశాలలు) హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా అభివృద్ధిపరుపబడినవి. పెంటపాడులో ప్రభుత్వ పోస్టు-బేసిక్ స్కూలు ఒకటి తెరువబడింది. లోకల్ బోర్డు, ఎయిడెడ్ పాఠశాలలకు భవన నిర్మాణం, పరికరాల గ్రాంటులు యివ్వబడినవి. తెలంగాణా ప్రాంతంలో 74 పాఠశాలల్లో పై తరగతులు అనగా 4, 5, 6, ఫారాలకు సమానమైన 8, 9, 10 తరగతులు ప్రారంభింపబడినవి. మహబూబాబాదులోని ప్రభుత్వ వున్నత పాఠశాల బహుళార్థసాధక పాఠశాలగా అభివృద్ధి పరుపబడింది. వివిధ పాఠశాలల్లో తెరువబడిన అదనపు సెక్షనులలో మొత్తం 42 మంది వుపాధ్యాయులు అదనంగా నియమింపబడ్డారు. ముఖ్య విషయాల బోధనను అభివృద్ధి పరచుటకై 46 ప్రభుత్వ వున్నత పాఠశాలలకు కుర్చీలు, బల్లలు, పుస్తకాలు, శాస్త్ర పరికరాలు సరఫరా చేయబడినవి. ఈ 46 వున్నత పాఠశాలల్లోను గల గ్రంథాలయాలు కూడా అభివృద్ధి పరచబడ్డాయి.

## సాంఘిక విద్య

ఆంధ్ర ప్రాంతంలో, కేంద్ర ఫిల్ము గ్రంథాలయానికి దృశ్య-శ్రవణ విద్యకు వుపకరించు పరికారాలు సరఫరా చేయడ్డాయి. ప్రాంతీయ, జిల్లా గ్రంథాలయాలకు గ్రాంటులు యివ్వబడినవి. తెలంగాణా ప్రాంతంలో సాంఘిక విద్యా సారస్వతంపై 12 పుస్తకాలు ప్రకటింపబడ్డాయి. కొందరు సాంఘిక విద్యా కార్యకర్తలకు శిక్షణ యివ్వబడింది. నిర్ణీతమైన కొన్ని వున్నత పాఠశాలలకు దృశ్య-శ్రవణ విద్యా పరికరాలు సరఫరా చేయబడినవి. దృశ్య-శ్రవణ విద్యా సిబ్బంది శిక్షణకై గోష్ఠులు జరుపబడినవి. జిల్లాల్లో గ్రంథాలయ సౌకర్యాల విస్తరణకై జిల్లా గ్రంథాలయ అథారిటీలకు గ్రాంటులు యివ్వబడినవి.

## హిందీ ప్రచారం

తెలంగాణా ప్రాంతంలో సెకండరీ పాఠశాలల్లో హిందీభాషా బోధనను అభివృద్ధి పరుచుటకై వున్నత, మాధ్యమిక—వున్నత పాఠశాలల్లో 90 మంది,

ప్రాథమిక-మాధ్యమిక పాఠశాలల్లో 50 మంది అర్హులైన ఉపాధ్యాయులు నియమించబడ్డారు. మొత్తం 211 పాఠశాలలకు హిందీ పుస్తకాలు కూడా సరఫరా చేయబడ్డాయి.

విధానం విషయంలో విద్యా ప్రమాణాన్ని హెచ్చించుటకు, విద్యా సౌకర్యాలను విస్తరింప చేయుటకు దానిలో దిగువ ముఖ్యమైన మార్పులు చేయబడినవి.

రాష్ట్రంలోని ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలన్నీ అంచెల వారిగా స్వాధీనం చేసుకుని వాటిని ఆయా జిల్లా బోర్డులకు అప్పగించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఎందువల్లనంటే వాటి నిర్వహణాధికారులు తమ పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయుల ప్రయోజనాలపట్ల శ్రద్ధ చూపకుండా వాటిని కేవలం లాభాపేక్షతో నడుపుతున్నారని తేలింది. మొదట నెల్లూరు జిల్లాలోని ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలు స్వాధీనం చేసుకొనబడ్డాయి. జరిగే సంవత్సరంలో విశాఖపట్నం, అనంతపురం, పశ్చిమ గోదావరి, కృష్ణా, చిత్తూరు జిల్లాల్లోని పాఠశాలలను స్వాధీనం చేసుకోవాలని సంకల్పించబడింది.

ఉన్నత పాఠశాలల్లో క్రమశిక్షణ ప్రమాణాన్ని హెచ్చించుటకు, బోధనా సామర్థ్యాన్ని పెంపొందించుటకు అట్టిపాఠశాలలు ఒక్కొక్కదానిలో చదువగల విద్యార్థుల గరిష్ఠసంఖ్య 1000గా నిర్ణయించబడింది. ఒకవేళ గరిష్ఠసంఖ్య పైసంఖ్యను దాటితే, అప్పుడు నిర్వాహకులు, సాధ్యమైన చోటెల్లా పాఠశాలను మిడిల్, హైస్కూలు డిపార్టుమెంటులుగా విభజించాలని ఉత్తరువు చేయబడింది.

ఆంధ్ర ప్రాంతంలో 3 వ ఫారంవరకూ ఉచిత విద్య ప్రవేశపెట్టబడింది. విద్యార్థికి నెలకు జీతం రూ. 2-12-0 చొప్పున పాఠశాలల నిర్వాహకులకు, జీతం నష్టానికిగాను నష్టపరిహారం యివ్వబడుతున్నది.

పాఠ్యపుస్తకాల ప్రచురణను జాతీయం చేయుటకు ప్రభుత్వం నిర్ణయించింది. తొలి చర్యగా, 1958-59కి 5 వ. తరగతి తెలుగు వాచకాన్ని ప్రభుత్వం ప్రచురించింది. ప్రాథమిక పాఠశాలల స్టాండర్డ్సుకి, మాధ్యమిక పాఠశాలలకు వాచకాలు, ఇతర అన్ని విషయాలలో పాఠ్య పుస్తకాలు యిందునిమిత్తం ప్రత్యేకం ఏర్పాటు చేయబడిన ఆడ్-హాక్ కమిటీచే నిర్ణయించబడినవి.

మొదట రాజమండ్రిలో విద్యా, వృత్తివిద్యా గైడెన్సుబ్యూరో నెలకొల్పబడింది. ఆ తరువాత అది, తెలంగాణా అవసరాలను కూడా తీర్చేఉద్దేశంతో, హైదరాబాదుకి తరలించబడింది. ఈ సంవత్సరం కర్నూలులో స్త్రీలకై క్రొత్త కళాశాల ప్రారంభింపబడింది. విజయవాడలోని ఎస్. ఆర్. ఆర్., సి. వి. ఆర్. కళాశాలను ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది. జరిగే సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో కొన్ని కళాశాలలను స్వాధీనం చేసుకోవాలని కూడా సంకల్పించబడింది. నల్గొండలోని నాగార్జున కళాశాల యిదివరకే స్వాధీనం చేసుకోబడింది. పిఠాపురంలోని ఆర్. ఆర్. బి. హెచ్. ఆర్. హైస్కూలు కూడా 1958 సెప్టెంబరులో స్వాధీనం చేసుకొనబడింది.

జరిగే సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో ఉపాధ్యాయుల శిక్షణా సౌకర్యాలు బాగా విస్తరించబడినవి. ఆంధ్ర ప్రాంతంలో కొన్ని ప్రభుత్వ స్త్రీల శిక్షణా పాఠశాలల్లో స్త్రీలకు ఎలిమెంటరీ గ్రేడు శిక్షణా సౌకర్యాలు పునరుద్ధరించబడినవి.

విద్యావంతులలో నిరుద్యోగ నివారణ పథకం క్రింద 1958-59లో 1140 క్రొత్త పాఠశాలలు తెరువబడుతున్నాయి. మొదట 3 అభివృద్ధి కేంద్రాలలో (కొత్తపేట, కలికిరి, మేడ్చల్) ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య ప్రవేశపెట్టబడింది.

ఇనస్పెక్టరేటును బలపరుచుటకై వరంగల్లు, గుంటూరులలో అదనంగా 2 విద్యాశాఖ ప్రాంతీయ డిప్యూటీ డైరెక్టర్ల కార్యాలయాలు తెరువబడ్డాయి; తెలంగాణా ప్రాంతానికి యిద్దరు యినస్పెక్ట్రెస్‌లు, ఆంధ్ర ప్రాంతానికి ఒక అదనపు ఇనస్పెక్ట్రెస్, ఆంధ్ర ప్రాంతానికి యిద్దరు అదనపుజిల్లా విద్యాధికార్లు, రెండు ప్రాంతాలలోను అదనపు డిప్యూటీ ఇనస్పెక్టర్లు మంజూరు చేయబడ్డారు.

జరిగే సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతంలో 7 కొత్త ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలు తెరువ బడ్డాయి. తెలంగాణా ప్రాంతంలో బాలికలకై కొత్తగా 5 ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలు తెరువ బడ్డాయి.

ఈ విధంగా విద్యారంగంలో సర్వతోముఖమైన అభివృద్ధి కలుగుతున్నది.

## వైద్యం

కర్నూలులో నూతన వైద్య కళాశాల చక్కగా నడుస్తున్నది. ఈ సంవత్సరం కాకినాడలోను, వచ్చే యేడాది వరంగల్లులోను ప్రైవేటు వైద్య కళాశాలలను ప్రారంభించుటకై కృషి చేయబడు తున్నది. బోధనా ఆస్పత్రులు పునర్వ్యవస్థీకరించబడి భారతీయ వైద్య సంఘం చెప్పిన స్థాయికి కొని రాబడినవి. అండర్ గ్రాడ్యుయేటు, పోస్టుగ్రాడ్యుయేటు చదువుల అవసరాలకు అనుగుణంగా వుండుటకై అవసరపు పరికరాలు, సిబ్బంది, భవనాలతో బోధనా సంస్థలన్నీ ఆధునిక పద్ధతిలో అభివృద్ధి పరుపబడు తున్నవి. దేశీయ వైద్యం అభివృద్ధికి కూడా, ఆయుర్వేద, యునానీ వైద్యాలలో క్లినికలు పరిశోధనకు కొత్త సౌకర్యాలతో కూడిన పెద్ద కార్యక్రమం ఒకటి అమలుపరచ బడుతున్నది.

## ప్రజారోగ్యం

ప్రజల ఆరోగ్యానికి గల తీవ్రమైన ఆటంకాలను తొలగించుటకై ఆంధ్రప్రదేశ్ లో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో 23 ఆరోగ్య పథకాలు గల ఆరోగ్య కార్యక్రమాలు చేపట్ట బడినవి. వాటి వ్యయం రూ 154.94 లక్షలు. 1956-57, 1957-58 లలో యీ పథకాలపై రూ 45.28 లక్షలు ఖర్చు చేయబడినవి. 1958-59 లో ప్లానింగు సెక్టర్ లో రూ. 32.25 లక్షలు వ్యయమయే 16 పథకాలు మాత్రమే చేర్చబడినవి. మిగిలిన పథకాలు 1958-59 రాష్ట్ర బడ్జెటు క్రింద కొనసాగించ బడతాయి.

## మలేరియా

ఆంధ్రప్రదేశ్ లో మిక్కిలి ప్రధానమైన ప్రజారోగ్య సమస్య మలేరియా. జాతీయ మలేరియా నివారణ కార్యక్రమం మలేరియా నివారణ కార్యక్రమంలో ముఖ్య భాగమై వున్నది. ఇది మలేరియా రాకుండా 70 లక్షల మందిని రక్షించేది. జరిగే సంవత్సరంలో దీని శక్తిని హెచ్చించి మలేరియా నిర్మూలన కార్యక్రమంగా మార్చడం జరిగింది. ఇది రమారమి 300 లక్షల మందికి రక్షణ యిస్తుంది. ఈ నిర్మూలన కార్యక్రమం క్రింద రాష్ట్రంలో మలేరియా వ్యాపించని ప్రాంతాలలో తప్ప మిగిలిన అన్ని ప్రాంతాలలోను మందు నీళ్లు తీవ్రంగా జల్లబడతాయి. హైపర్, మిసో అంటువ్యాధి ప్రాంతాల సమస్యలు అంచెలలో చురుగ్గా మందు జల్లడంతో పరిష్కరించబడతాయి. జరిగే సంవత్సరంలో జాతీయ మలేరియా నివారణ కార్యక్రమానికి రూ. 12.35 లక్షలు మాత్రమే కేటాయించబడినవి. కాని తీవ్ర నిర్మూలన కార్యక్రమం అమలువల్ల మొత్తం రూ. 21.43 లక్షలను కేటాయించవలసి వచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం ఖర్చు రూ. 9.08 లక్షలు. పరికరాలు, డి.డి.టి. మున్నగువాటికై రూ. 48.17 లక్షలవరకూ కేంద్ర ప్రభుత్వంనుంచి వస్తాయి.

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ లో దిగువ ప్రాంతాలలో 9 మలేరియా యూనిట్లుపని చేస్తున్నాయి.

సర్కారు జిల్లాల్లో మైదానాలలో విశాఖపట్నం, విజయవాడ, నెల్లూరులలో 3 యూనిట్లు, ఏజన్సీ కొండ ప్రాంతాలలో అరకు, దుమ్ముగూడెములలో 2 యూనిట్లు పని చేస్తున్నాయి. అలాగే రాయలసీమలో అనంతపురంలో ఒక యూనిట్టు వుంది. తెలంగాణా జిల్లాల్లో, ఆదిలాబాదు, నిజామాబాదు, వరంగల్లులలో 3 యూనిట్లు వున్నాయి.

మచ్ ఖండ్ జల-విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు, గోదావరి వుత్తరకాలవ ప్రాజెక్టు (కడం), నాగార్జునసాగర్, హైదరాబాదు నగరాలలో యితర మలేరియా నిరోధ చర్యలు అమలు జరుగుతున్నాయి. ఇవిగాక ఆంధ్ర ప్రాంతంలో వివిధ స్థానిక సంస్థలు మలేరియా నిరోధం, దోమల నిరోధం, బోదకాలు నిరోధ కార్యక్రమాలను చేపడతాయి. ఇందుకై వాటికి కొంత గ్రాంటు-యిన్-ఎయిడ్ యివ్వబడుతుంది, ఆ పనిని ప్రజారోగ్యశాఖ మలేరియా సిబ్బంది అజమాయిషీ చేస్తుంది.

## కేంద్ర మలేరియా లేబొరేటరీ, వస్తు ప్రదర్శనశాల

రాష్ట్రంలో మలేరియా నివారణ పథకాలలో నియమితులైన సిబ్బందికి శిక్షణాసౌకర్యాలను కలిగించుటకు, పరిశోధనా సౌకర్యాల నిమిత్తముకూడా 1956-57 లో విశాఖపట్నంలో ఒక లేబొరేటరీ నెలకొల్పబడింది. దరిమిలాను 1957-58 ప్రారంభంలో అది హైదరాబాదుకి తరలించబడింది. అది అక్కడ పని చేస్తున్నది.

## బోదవ్యాధి

రాష్ట్రంలో ప్రజారోగ్యానికి ఆటంకంగా వున్న మరొక చిక్కు సమస్య బోదవ్యాధి. రాష్ట్రంలో దిగువ ప్రాంతాలలో ఒక సర్వే యూనిట్టు, 2 నివారణ యూనిట్లు వున్నాయి :

## సర్కారు జిల్లాలు

మండపేట-సాధారణ యూనిట్టు : ఇది తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకాలో వుంది. ఇది ఆ తాలూకాలోను, రాజమండ్రీ తాలూకా కొంత భాగంలోనుగల 3 లక్షల మందికి వుపకరిస్తుంది. 1957 ఏప్రిల్ లో మాస్ థెరపీ పూర్తి అయింది. ఇప్పుడు పోస్టు థెరపీ పరిశీలనలు, సర్వే జరుగుతున్నాయి.

## మనైర్ కంట్రోలు యూనిట్టు

ఇది కరీంనగరు జిల్లాలో కొంత పనిచేసే యూనిట్టుగా పనిచేస్తున్నది. దీనివల్ల లక్ష మందికి మాత్రమే రక్షణ కలుగుతున్నది. కాని యీ సంవత్సరం అది పూర్తి యూనిట్టుగా మార్చబడింది; యింక అది 3 లక్షలమందికి వుపకరిస్తుంది.

## హైదరాబాదు సర్వేయూనిట్టు

ఇది ఒక [illegible] సంచార యూనిట్టు. పరిశీలనలు జరిపి యీ వ్యాధి యేయే ప్రాంతాలలో వ్యాపిస్తుందో నిర్ణయించుటకు యిది తెలంగాణా ప్రాంత మంతా తిరుగుతుంది.

## యాస్

కొండ, ఏజన్సీ ప్రాంతాలలో గిరిజనులకు వచ్చే గడ్డువ్యాధి యాస్. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో యాస్ నివారణ యూనిట్టు ఒక్కటే వుంది. అది ప్రస్తుతం పశ్చిమ గోదావరి జిల్లా యేజన్సీ పోలవరంలో పనిచేస్తున్నది. అక్కడ 1955-57ల మధ్య ప్రారంభ చికిత్సా సర్వే పూర్తి చేయబడింది. ఇప్పుడు మొదటి రిసర్వే జరుగుతున్నది. ఈ యూనిట్టు 1958 మార్చి ఆఖరువరకూ తెలంగాణాలో ఆదిలాబాదులో ప్రారంభ చికిత్సా సర్వే జరిపింది. ఆంధ్ర ప్రాంతంలో రిసర్వే పూర్తిఅయిన పిమ్మట ఆయూనిట్టు తిరిగి తెలంగాణా ప్రాంతానికి, మొదటి రిసర్వే జరుపుటకు, తరలించబడుతుంది.

## బి. సి. జి. టీకాలు

ఆంధ్ర ప్రాంతంలో బి. సి. జి. టీకాల ద్వారా క్షయను నిరోధించుటకై ఒక కేంద్ర పరిపాలనా వ్యవహార యూనిట్టు, 6 ఫీల్డు టీములు పని చేస్తున్నాయి.

ముఖ్యంగా ఉమ్మడిగా బి. సి. జి. టీకాలు వేసే వుద్యమం సమర్థంగా కొనసాగింది; యీరాష్ట్రానికి లక్ష్యంగా నిర్ణయించబడిన సంఖ్యను దాటిందికూడా. తెలంగాణాలో పని 2-1-1953న ప్రారంభమయి, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు ముందు పూర్తిఅయింది. ఆంధ్రలో ఆపని 15-10-54న ప్రారంభించబడింది. యిప్పటికి శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, చిత్తూరు, అనంతపురం జిల్లాల్లో పూర్తి చేయబడింది. ఆయాప్రాంతాలలో వున్నవారి సంఖ్య వరుసగా 106 లక్షలు, 135 లక్షలు అయివున్నది. వారిలో యించుమించు 78 లక్షలు, 52 లక్షలమంది పరీక్షింపబడ్డారు. 29 లక్షలు, 19 లక్షల మందికి టీకాలు వేయబడినవి. ఆంధ్రప్రదేశ్ యేర్పడిన పిమ్మట పూర్వ హైదరాబాదు రాష్ట్రంచే యీ రాష్ట్రానికి కేటాయించబడిన 5 జట్టులలోను,

నిజామాబాదు జిల్లాలో రెండవసారి టీకాలువేస్తున్న 3 జట్టులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనుమతితో, 1957 ఏప్రిల్‌లో నెల్లూరు జిల్లాకు పంపబడినవి. ఆవిధంగా ద్వితీయ ప్రణాళిక సమాప్తినాటికి రాష్ట్రంలో ఆ వ్యాధికి గురికాగల ప్రజలందరికీ టీకాలు వేయుటకు వీలు కలిగించబడింది. ప్రస్తుతం యీపని కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాలలో జరుగుతున్నది.

## శిక్షణా కార్యక్రమాలు

ప్రజారోగ్య కార్యక్రమాల అమలులో కలిగే తీవ్రమైన చిక్కులలో సాంకేతిక సిబ్బంది కొరత ఒకటి. అందులో యిప్పుడు శిక్షితులైన హెల్తు విజిటర్ల కొరత మరీ చిక్కు సమస్యగా వుంది. ఈ కొరతను తీర్చుటకై విశాఖపట్నం హెల్తు విజిటర్ల శిక్షణా పాఠశాలలో యేటా యించుమించు 52 మంది, హైదరాబాదులో నిలోఫర్ హెల్తు విజిటర్ల శిక్షణా పాఠశాలలో 90 మందికి శిక్షణ యివ్వబడుతున్నది. ప్రస్తుతపు శిక్షణా సౌకర్యాలను విస్తరించే విషయం కూడా ఆలోచనలో వుంది. పరిజారోగ్య నర్సింగులో శిక్షణ పొందుటకై మామూలు నర్సులు అఖిల భారత పారిశుద్ధ్య, పరిజారోగ్య సంస్థకు పంపబడు తున్నారు కూడా. పల్లె ప్రాంతాలలో మంత్రసానుల నైపుణ్యాన్ని పూర్తిగా అభివృద్ధి పరచుటకై దాయాల శిక్షణ పథకం ఒకటి ప్రారంభింపబడింది. దాని క్రింద పల్లెటూరు మంత్రసానులకు ఆధునిక పద్ధతిలో పురుడు పోయుట నేర్పబడుతుంది. వేర్వేరుసహాయ ఆరోగ్య కార్యకర్తలు తమ తమ శాఖల ప్రజారోగ్యంలో యెక్కువ నైపుణ్యాన్ని సంపాదించడం అవసరం. కాబట్టి ప్రజారోగ్యశాఖ అధికారులు శిక్షణకై విదేశాలు, ఇండియాలో యితర ప్రాంతాలకు కూడా పంపబడు తున్నారు. వారు అక్కడ మలేరియా, పారిశ్రామిక పారిశుద్ధ్యం, క్షయ, కుష్ఠు, ప్రజారోగ్యంలో డిప్లమో వంటివాటిలో శిక్షణ పొందుతారు.

## ప్రసూతి, శిశు సంరక్షణ

పల్లెప్రాంతాలలో ముఖ్యంగా వెనుకబడిన తెలంగాణా ప్రాంతాలలో వైద్య, ఆరోగ్య సౌకర్యాలు తక్కువగా వున్నాయి. అక్కడ ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రాలు తెరువబడుతున్నాయి. ఇందుకై ద్వితీయ ప్రణాళికలో రూ 4.04 లక్షలు కేటాయించ బడినవి. ఆప్రకారం 1957-58లో 2 కేంద్రాలు తెరువబడినవి.

## కుటుంబ నియంత్రణ

కుటుంబ నియంత్రణ పథకం 1957-58 ప్రణాళికా పథకాలలో చేర్చబడింది. హైదరాబాదులో 1955లో ప్రారంభింపబడిన కుటుంబ సంక్షేమ కేంద్రం ప్రణాళిక క్రింద 1957-58లో రూ 25,000 ఖర్చుపై చేపట్టబడింది.

ప్రణాళికలో 1957-58లో పల్లె ప్రాంతాలలో కుటుంబ నియంత్రణ క్లినిక్కుల ప్రారంభానికి సంబంధించిన పథకంకూడా చేపట్టబడింది. ఆయా సంవత్సరాలలో తెరువబడిన మొత్తం కేంద్రాల సంఖ్య వరుసగా 44, 45, 44, 43 అయివున్నది. పట్టణ ప్రాంతాలలో కూడా 14 కేంద్రాలను ప్రారంభించుటకు తలపెట్టబడింది. ప్రణాళికలో ఈ సంవత్సరంలో 89 కేంద్రాలు ప్రారంభింపబడతాయి. 1957 డిసెంబరు నుంచి ప్రజారోగ్యం యిన్‌ఛార్జి (కు. ని.) అసిస్టెంటు డైరెక్టరు ఒకరు నియమించబడ్డారు.

1954 డిసెంబరులో విశాఖపట్నంలో హెల్తు విజిటర్ల శిక్షణకై తెరువబడిన పాఠశాల గడచిన రెండు సంవత్సరాలలోను పని చేసింది. 1956-57 లో 49 మంది స్కూలు ఫైనలు అభ్యర్థులు, 1957-58 లో 23 మంది శిక్షణకై చేర్చుకోబడ్డారు.

దేశవాళీ మంగలి మంత్రసానులు (దాయాలు) శుచియైన విధానంలో పురుడు పోయడం నేర్చుకుని తమ వృత్తిని కొనసాగించు కొనుటకు శిక్షణ నిచ్చుటకై 1956-57 లో ఒక పథకం ప్రారంభింపబడింది. ఏటా 360 మంది దాయాలకు శిక్షణ నిస్తూ ఆ పథకం నేటికీ కొనసాగు తున్నది. ద్వితీయ పంచవర్ష పరిణాళిక తొలి, మలి సంవత్సరాలలో

924 మంది దాయాలకు శిక్షణ యివ్వబడింది. ద్వితీయ ప్రణాళిక సమాప్తి నాటికి 3600 మందికి శిక్షణ యివ్వాలని సంకల్పించ బడింది.

సదాదికి యిద్దరు చొప్పున 10 మంది మామూలు శిక్షణ పొందిన నర్సులకు కలకత్తాలోని అఖిలభారత పారిశుద్ధ్య, ప్రజారోగ్య సంస్థలో ప్రజారోగ్య నర్సింగులో శిక్షణ యిచ్చుటకు వుద్దేశించ బడిన పథకం అమలు గడచిన రెండు సంవత్సరాలలోను కొనసాగించ బడింది.

ప్రపంచ ఆరోగ్య సంస్థ సహాయంతో విశాఖ పట్నంలో ప్రారంభింప బడిన ప్రసూతి, శిశు ఆరోగ్య నర్సింగు ప్రాజెక్టు తృప్తికరంగా నడుస్తున్నది. ప్రపంచ ఆరోగ్య సంస్థ సహాయంతో హైదరాబాదులో 1953 లో ప్రారంభించ బడి 1956 లో పూర్తిచేయ బడిన అదేరకం ప్రసూతి, శిశు ఆరోగ్య ప్రాజెక్టు కార్య కలాపాలు అంతర్జాతీయ సిబ్బంది వుప సంహారణ అనంతరం కూడా కొనసాగు తున్నాయి. ఈ ప్రాజెక్టు పురవడి ఫలితంగా 1071 మంది దాయాలు కొత్తగా శిక్షణ పొందారు.

## పౌష్టికాహారం

ప్రస్తుతపు ఆహార పద్ధతులను పరిశీలించుటకు, ఆహార విధానం వల్ల కలిగే లోపాలను తెలుసు కొనుటకు, బలహీనులైన వర్గాలలో దుష్టాహారం అలవాట్లను తప్పించుటకు, పరిపూరకమైన పౌష్టి కాహారాన్ని సరఫరా చేయుటకు, ప్రజలకు పౌష్టి కాహారాన్ని గురించి బోధించుటకు పౌష్టి కాహార పరిశోధన పథకం ఒకటి విశాఖ పట్నంలో ప్రాంతీయ పౌష్టి కాహార యూనిట్టు స్థాపనద్వారా ప్రారంభించ బడింది. దరిమిలాను అది గుంటూరుకి తరలించ బడింది. 1957-58 లో రాయలసీమ ప్రాంతానికై కర్నూలులో మరొక ప్రాంతీయ యూనిట్టు నెలకొల్ప బడింది. అలాగే యిటీవల మరొక యూనిట్టు వరంగల్లులో ప్రారంభించ బడింది.

## ఆరోగ్య విద్య

ప్రజా బాహుళ్యానికి ఆరోగ్య విషయాలను గురించి బోధించుటకై ప్రజారోగ్య శాఖ డైరెక్టరు కార్యాలయంలో కేంద్ర ఆరోగ్య విద్యాబ్యూరో (ప్రచారం, ప్రచురణ) నెలకొల్ప బడింది. ప్రచారం, అంటువ్యాధి పనులకై 11 జీపులు, 3 అంటువ్యాధి వాన్‌లు జిల్లా ఆరోగ్య అధికార్లకు యివ్వబడినవి. అవి గడచిన రెండు సంవత్సరాలలోను తమ పనిని కొనసాగించినవి.

## మందుల పెట్టెలు

ఎక్కువ గ్రామమందుల పెట్టెలు కావాలన్న కోర్కెకు అనుగుణంగా 1957-58 లో వైద్య సహాయం లభించని మారుమూల గ్రామాలకు 54 పెట్టెలు సమకూర్చబడినవి. 1958-59 లో మరి 54 పెట్టెల సరఫరా మంజూరు చేయబడింది. తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో సరఫరా చేయబడిన పెట్టెలు 797 వున్నాయి.

## పాఠశాలా ఆరోగ్య క్లినిక్కులు

తెలంగాణా జిల్లాల్లో బడిపిల్లల ఆరోగ్య పరీక్షకై ప్రత్యేక సిబ్బందిలేదు. ఆస్పత్రులు, ఔషధశాలల వైద్యాధికారులే యేటా రెండుసార్లు వారిని పరీక్షి స్తున్నారు. కాబట్టి ప్రతి జిల్లా ముఖ్యపట్నంలోను పూర్తికాలం పనిచేసే వైద్యాధికారులతో యేటా రెండు చొప్పున స్కూలు క్లినిక్కులను యేర్పాటు చేసే పథకం 1957-58 లో చేపట్టబడింది. ఆ ప్రకారం 1957-58 లో 2 స్కూలు క్లినిక్కులు తెరువబడినవి.

## గ్రామ పారిశుధ్య యూనిట్టు

పల్లెప్రాంతాల పరిసర పారిశుద్ధ్యాన్ని పరిశీలించి దాని అభివృద్ధికి అవసరమైన నమూనాలను రూపొం దించుటకై 1954-55 లో ఒక కేంద్ర (న్యూక్లియస్) ప్రజారోగ్య ఇంజనీరింగు సంస్థ నెలకొల్పబడింది. అది 1956-57 లలో కూడా పని చేసింది.

## వైటల్ స్టాటిస్టిక్సు

ప్రజారోగ్య డైరెక్టరేటులో వైటల్ స్టాటిస్టిక్సు తయారీకై యంత్ర పరికరాల వుపయోగానికై ఒక పథకం తలపెట్టబడింది. ఇందువల్ల స్టాటిస్టిక్సు తయారీ పని సామర్థ్యం హెచ్చగలదు.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

జనాభాలో 100 కి 80 వంతులకుపైగా గ్రామాలలో నివసిస్తారు. అందుచేత సమాజాభివృద్ధి కేంద్రాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలద్వారా ప్రజలకు సమగ్రమైన నివారణ, నిరోధ ఆరోగ్యసేవ అందించబడుతున్నది. ఈరకం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు 90 వున్నాయి. తెలంగాణాలో పట్టన్ చెరువులో ఒక మోడల్ మెడికల్ అండ్ హెల్తు యూనిట్టు, యితర స్థలాలలో మరి 19 వైద్య, ఆరోగ్య యూనిట్లు కూడా వున్నాయి. అలాగే ఆంధ్రలో యుద్ధానంతర పునర్నిర్మాణం, గ్రామ సంక్షేమ పథకాలక్రింద ప్రారంభింపబడిన 13 కేంద్రాలు, సింహాచలంలో గ్రామీణ ఆరోగ్య కేంద్రం వున్నాయి.

## రోడ్డురవాణా

గ్రామీణ రవాణా సర్వీసు జాతీయకరణను విస్తరింపచేయుటకు, ప్రస్తుతం ప్రభుత్వంచేతిలోగల పనులను స్వతంత్ర సంస్థకు అప్పగించుటకు ప్రభుత్వం నిర్ణయించుటతో 11-1-58 న ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా కార్పొరేషన్ నెలకొల్పబడింది, ఈ సంస్థ 1-4-58 నుంచి కృష్ణాజిల్లాలో కొన్ని మార్గాలలో బస్సులను నడుపుతున్నది. ఈ కొత్త బస్సులు చక్కగా నడుపబడుతున్నవని కృష్ణాజిల్లా ప్రజలు ప్రశంసించారు. నగరంలోను, తెలంగాణా ప్రాంతంలోను కొన్ని మార్గాలను, కొత్తబస్సులు లభ్యం కాగానే ఆధునికం చేయుటకై యీ సంస్థ చర్య తీసుకుంటున్నది.

## సమాజాభివృద్ధి

సమాజాభివృద్ధి రంగంలో ఆంధ్రప్రదేశ్ సాధించిన అద్భుతమైన అభివృద్ధిని పలువురు ప్రముఖులు ప్రశంసించారు. ఇప్పుడు రాష్ట్రంలో 222 అభివృద్ధి కేంద్రాలు - 130 అంచె 1 కేంద్రాలు, 45 అంచె 2 కేంద్రాలు, 4 బహుళార్థసాధక ప్రాజెక్టులతోసహా 34 సమాజాభివృద్ధి కేంద్రాలు, 13 ప్రి-ఎక్స్‌టెన్షన్ కేంద్రాలు వున్నాయి. ఈ అభివృద్ధి కేంద్రాలలో నిర్మాణ కార్యక్రమం మహావేగంతో కొనసాగుతున్నది. ఇందులో ప్రజల సహకారం దినదినాభివృద్ధి చెందుతున్నది. ఈ కేంద్రాలలో ప్రజలు యిచ్చిన సొమ్ము ప్రభుత్వ ఖర్చులో 100 కి 57 వంతులవరకూ వున్నట్లు అంచనా. 1958 మార్చి నెలాఖరునాటికి ప్రభుత్వవ్యయం మొత్తం రూ. 7.38 కోట్లుకాగా ప్రజలు రొఖ్ఖం, వస్తు, శ్రమరూపాలలో రూ. 4.18 కోట్లు యిచ్చారు.

బల్వంత్‌రాయ్ మెహతా కమిటీ సిఫార్సుచేసిన ప్రజాస్వామ్య వికేంద్రీకరణసూత్రం అమలులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అగ్రగామియయినది. రాష్ట్రంలో జిల్లాకొకటిచొప్పున 1-7-58 న 20 ఆడ్ హాక్ పంచాయితీ సమితులు ప్రారంభించబడ్డాయి. పంచాయతీ సమితుల పనిని అజమాయిషీ చేయుటకై త్వరలోనే జిల్లా పరిషత్తులు నెలకొల్పబడగలవు. శాసనసభ వచ్చే సమావేశంలో కొత్త శాసనాన్ని ఆమోదించుట ద్వారా యీ సమితులకు చట్టబద్ధమైన ప్రాతిపదిక యివ్వబడుతుంది. ఇదికాక, "కుటుంబానికొక పథకం"వంటి యితర పథకాలద్వారా కూడా యీ వుద్యమం నూతనమైన యితర మార్గాలకూడా ముందుకు నడుపబడుతున్నది. ఈ "కుటుంబానికొక పథకం" కార్యక్రమం మొదట 20 గ్రామాలలో అమలుపరచబడుతుంది. కడప, మహబూబునగరం జిల్లాల్లో గ్రామదాన గ్రామాలకై 3 కొత్త పైలట్ ప్రాజెక్టులు ప్రారంభింపబడుతున్నాయి.

-:0:-:0:-

# బిక్కవోలు దేవాలయాలు

డా. మారేమండ రామారావు.

బిక్కవోలు తూర్పుగోదావరి జిల్లాలో రాజమండ్రీ, కాకినాడల మధ్య వుంది. ఈ గ్రామానికి రైలులో వెళ్ళవచ్చు. ఆ పేరుతో గ్రామానికి యించుమించు ఒకమైలు దూరంలో దక్షిణరైల్వే బెజవాడ-వాల్తేరు సెక్షన్‌లో రైలుస్టేషను వుంది. అక్కడికి రాజమండ్రీ నుంచి, కాకినాడ నుంచికూడా సరాసరి బస్సులోకూడా వెళ్ళవచ్చు. ఈ గ్రామం ఆధునిక నామం బిక్కనవ్రోలు లేక బిరుదాంకన వ్రోలుయొక్క భ్రష్టరూపం. ఈ బిక్కనవ్రోలు లేక బిరుదాంకనవ్రోలు పేరు ప్రసిద్ధుడైన వేంగిచాళుక్య రాజు గుణగ-విజయాదిత్యుని పేరుదు బిరుదాంక-[illegible] పెట్టబడినది. ఈగ్రామంలో ఆరు ప్రాచీన దేవాలయాలు వున్నాయి. అవి యీరాజు నిర్మించాడని అంటారు. వేంగిచాళుక్య నిర్మాణం, శిల్పాలలో మొట్టమొదట వెలిసిన నిదర్శనలు యీ దేవాలయాలే. దక్షిణ భారతదేశంలో కళ, శిల్ప నిర్మాణాల పరిణామ పరిశీలనలో వాటికి ప్రత్యేక ప్రాముఖ్యమున్నది.

గ్రామానికి మధ్యలోనున్న ఒక ఆవరణలో 3 దేవాలయాలు, బయట 3 దేవాలయాలు వున్నాయి. బయటి దేవాలయాలలో రెండు గ్రామానికి ఈశాన్య చివరగల బోర్డు హైస్కూలుకి సమీపంలోను, ఒకటి పూలపల్లి రోడ్డుమీదవున్నాయి. గ్రామంలోగల మూడు దేవాలయాలు రాజరాజేశ్వర, గోలింగేశ్వర, చంద్రశేఖర ఆలయాలని వ్యవహరింపబడుతున్నాయి. ఇవి తూర్పుముఖంగా వున్నాయి. వాటి ఆవరణకు తూర్పు, పడమరల రోడ్లు, ఉత్తర, దక్షిణాల యిళ్ళువున్నాయి. ఆవరణ సింహద్వారం తూర్పువైపున వుంది. దానిపై ఆధునికంగా నిర్మింపబడిన గోపురం వుంది. ఉత్తర, దక్షిణాల మరి రెండు ద్వారాలు వున్నాయి. గోపుర ద్వారంగుండా వెడితే ఆవరణలోకి వస్తాము. రాజరాజేశ్వరస్వామి ఆలయం దక్షిణాన, గోలింగేశ్వర స్వామి ఆలయంమధ్యను, చంద్రశేఖరస్వామి ఆలయం ఉత్తరాన వున్నాయి. మధ్యనున్న ఆలయం యెదుట ఆధునికంగా నిర్మించిన సన్నని ప్లాటుఫారం వుంది. మిగతా రెండు ఆలయాలు యీమధ్య ఆలయం సెల్లాకి యిటు అటు వున్నాయి.

## రాజరాజేశ్వరస్వామి ఆయలం

వసారా:- ఈ దేవాలయం ముందు పైకప్పులేని సన్నటి వసారావుంది. దీని పక్కగోడలు రెండూ దేవాలయం ప్రధానభాగం నుంచి ముందుకు వచ్చివున్నాయి. ఈ పక్కగోడల అగ్రాన



రాజరాజేశ్వరాలయం

పైవైపున చక్కని శిల్పాలు వున్నాయి—మకర తోరణం చివరిభాగం, దానిపై ఒక మరుగుజ్జు కూర్చున్నట్లు మలచబడ్డాయి యివి.

అడుగుభాగం : దేవాలయం అడుగుభాగం సాదాగావుంది. అడుగునుంచి పైకి దానిపై అరలు అరలుగా, మంచపాటి గట్టులుగా వుంది. వెడల్పైన

ఒక గట్టువంటిదానిపై కీర్తిముకుటాలు మలచ బడ్డాయి.

గోడలు : ఈ దేవాలయం గోడలపై నిర్మాణ శిల్ప సభ్యులు, వారితో సంబంధంగల కొన్ని శిల్పాలు వున్నాయి. ముందరి గోడ తూర్పుముఖంగా వుండి, పైనచెప్పిన వసారాకు ఆవలవున్నది. దానికిమధ్యలో ఒక ద్వారము, దానికిరుపక్కల రెండు గోడ ముక్కలు వున్నాయి. ఈ రెండు గోడముక్కలమీద లోతైన అర ఒకటి, రెండు స్తంభాల మధ్యవున్న కోసు అరఒకటి వున్నాయి. దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశలగల గోడలు యెక్కువగా అలంకరించబడి వున్నాయి. వాటిలో ఒక్కొక్కదానిలో వరుసగా 1. రెండు స్తంభాగ్రాలమధ్యగల కోసు అర 2. రిసీడింగ్ రీసెస్ 3. ఒంటి స్తంభం అగ్రానగల కోసు అర 4. రెండు స్తంభాగ్రాలమధ్యగల కోసు అర 5. రెండు స్తంభాగ్రాలమధ్య కోసుగావున్న మధ్య అర, దీనికి మధ్యలో గూడువుంది. 6. రెండు స్తంభాగ్రాలమధ్యగల కోసు అర 7. రెండు స్తంభాగ్రాల మధ్యగల సన్నపాటి అర 8. రిసీడింగ్ రీసెస్ 9. రెండు స్తంభాగ్రాల మధ్యగల కోసు అర. ఈ స్తంభాగ్రాలపై ముక్కోణాకారం ఆమలకాలు వున్నాయి. వాటిపైన సన్నపాటి అర, దానిపై క్రిందగా ఇల్లు వరుసగా అంతటా వ్యాపించిన గట్టు వున్నాయి. దీనిపైన వివిధ హాస్యభంగిమలలోనున్న మరుగుజ్జుల వరుసవుంది. ఇది పైన నిర్మాణానికి ఆధారంగావుంది.

విమానం—ఈ దేవాలయం విమానానికి అనేక వరుసలున్నాయి. మొదటి లేక అడుగువరుసలో సింహాలవరుస, మకరముఖాలు వున్నాయి. రెండవ వరుసలో దిగువ రెండు స్తంభాగ్రాల మధ్యగల ఒక్కొక్క అరకే పైన కర్ణకుడులు వున్నాయి. అరలకు పైన గూళ్లుగల పెద్దపెద్ద శాలలు వున్నాయి. మూడవ వరుసలో క్రింద కర్ణకుడు భాగాలపైన మూడు స్తంభాగ్రాలు, దిగువ శాలభాగానికి పైన స్తంభాగ్రాలమధ్య విశాలమైన స్థలము వున్నది. నాలుగవ అరలో, మధ్యమధ్య కురుచ స్తంభాగ్రాలు గల రీసెస్ వున్నది. పైన సన్నటి పసారావుంది. అక్కడ ఒక రీసెస్ వుంది. దానిపై మధ్య పెద్దకీర్తి మకుటంగల మరొక రీసెస్ వుంది. దీనిపై మూడు పద్మాలతో కుడువంటి అగ్రంవుంది. శిఖరాగ్రాన కలశంవుంది.

సెల్లా :- దేవాలయానికి ముందుగల వసారా ఆవలగల సాదాగుమ్మంలోనుంచి సరాసరి సెల్లాలోనికి వెళ్లవచ్చు. ముందు గదిలేదు. సెల్లామధ్యలో అంత యెత్తులేనివేది ఒకటివుంది. దానిపై స్థూపాకారపు లింగంవుంది. అది యించుమించు 2అ. యెత్తువుంది. దానిపై గుర్తువుంది.

శిల్పాలు :- మధ్య గూళ్లు మూడింటిలోనుగల పక్కని శిల్పాలు యీ దేవాలయం గోడలకు అలంకార ప్రాయంగా ఉన్నాయి. దక్షిణపు గోడ గూడు కింద నిల్చున్న యేనుగను ఆనుకుని వుంది. గూడుపైన మధ్యభాగంలో ఒక కురుచ స్తంభం వుంది. దానిపై పూర్తిగా వికసించిన పద్మంవుంది. ఆ పద్మం పక్కల తీగలు వ్రేలాడు తున్నాయి.



గూటిలో గణపతి—రాజరాజేశ్వరాలయ దక్షిణ కుడ్యం

పద్మానికి దిగువ స్తంభానికి ఇరుపక్కలా హంసలు వున్నాయి: వాటిలో కలువతూడులు ముక్కుల్లో కరచు తున్నాయి. ఒక్కొక్క హంసకూ వెనుక ఒక మనిషి నిల్చుని వున్నాడు. గూటిమధ్య గణపతి విగ్రహం వుంది. ఆయన పద్మపీఠంపై రెండవ కాలు ముడుచుకుని కూర్చున్నాడు. కుడికాలు మోకాటి వద్ద వంగి పైకి యెత్తివుంది. ఆయన పై కుడి చేతిలో దంతము, పై యెడమ చేతిలో యేదో మరొక వస్తువు వున్నాయి. క్రింద యెడమ చేతిలో

వుంద్రాళ్లు వున్నాయి. తొండం చివర వాటిపై వుంది. క్రింద ఒక ఎలుక వుంది.

పడమర గోడలో పైన చెప్పినట్టిదే మరొక గూడు వుంది. ఈ గూటిలో కుమారస్వామి విగ్రహం వుంది. ఆయన యెడమ కాలు ముడుచుకుని కుడికాలును వ్రేలాడ వేసుకుని కూర్చున్నాడు. వ్రేలాడే కాలు దిగువగల నెమలిపై వేసి వుంది. ఈయన కుడిచేతిలో శక్తి వుంది. ఎడమ చేత్తో యెడమ తొడపై నిలచి వున్న కుక్కుటాన్ని దువ్వుతున్నాడు. దిగువ మరొక విభాగం వుంది. అక్కడగల యేనుగను యిద్దరు ఋషులు పూజిస్తున్నారు. దీనికి దిగువ ఒక మరుగుజ్జు కూర్చుని వున్నాడు.



కుమారస్వామి - రాజరాజేశ్వరాలయం పశ్చిమకుడ్యం

ఉత్తరపు గోడ గూటిలో మహిషాసురమర్దని విగ్రహం వుంది. నిల్చుని వున్న యీ దేవికి ఆరు చేతులు వున్నాయి. కుడి చేతులలో ఒకటి విస్మయంలో పైకి యెత్తి వుంది. ఒక దానిలో ఖడ్గం వుంది. మరొక దానితో మహిషుని తలలోనికి శూలాన్ని గ్రుచ్చుతున్నది. క్రింద వాడు పడిపోయి వున్న మహిషంపై నిల్చునివున్నాడు. ఎడమ చేతులలో ఒక దానిలో ఖట్వాంగము, రెండవ దానిలో డాలు, మూడవ దానిలో మహి



చాముండేశ్వరి - గోలింగేశ్వరాలయం ఉత్తరపుగోడ

షుడుపట్టుకున్న కత్తి చివర వున్నాయి. దేవికి పైన యిద్దరు దేవతలు యెగురుతూ ఆమె శిరస్సుకి పైన కిరీటాన్ని పట్టుకున్నారు. దిగువగల మరొక విభాగంలో ఒక మరుగుజ్జు కూర్చుని వున్నాడు. దీనికి దిగువ ఒక దేవత కూర్చుని వుంది. ఆమె కుడిచేతిలో నాగము వుంది. ఎడమ అరచేయి యెడమ కాలిపై వుంది.

విగ్రహాలు :- ఈ దేవాలయం సల్లాలో లింగానికి వుత్తరంగా ఒక దేవి విగ్రహం వుంది. ఈమె సముభంగంలో నిల్చుని వుంది. పై కుడిచేతిలో పరశువు, పై యెడమ చేతిలో పాశము వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలోను, క్రింది యెడమ చేయి వరద ముద్రలోను వున్నాయి.

## చంద్రశేఖరస్వామి ఆలయం

వసారా:- ఈ ఆలయం ముందుకూడా రాజరాజేశ్వరాలయం ముందువలనే పైకప్పులేని వసారా ఒకటివుంది.



చంద్రశేఖరాలయం

అడుగుభాగం:- ఈ దేవాలయం అడుగుభాగంపై అడుగునుంచి పైకి గట్టు, పల్లపుప్రదేశము, మళ్లీ గట్టు అరలుఅరలుగావున్న పల్లపుప్రదేశము వున్నాయి. ఈ అరలు కురుచగావున్న స్తంభాగారాలవల్ల యేర్పడ్డాయి. పైన కోసుపట్టేవుంది.

గోడలు:- ఈ దేవాలయంముందు గోడకు మధ్యలో ద్వారంవుంది. దానికిరుపక్కలా గోడ

ముక్కలు వున్నాయి వీటిలో ఒక్కొక్క భాగం లోను, ఒక రిసిడింగ్ రీసెస్, రెండు స్తంభాగ్రాల మధ్యగల ఒక అర వున్నాయి స్తంభాగ్రాలపైన ముక్కోణాకారంగల ఆమలకంవుంది దీనిపైన మరుగుజ్జుల వరుసవుంది ఇది పై కట్టడానికి ఆపుగావుంది దీనికి పైనగల అంచు శిఖరాలచే అలంకరించబడింది ఈ శిఖరాలలోపల అష్టదళ పద్మాలు వున్నాయి ఈ శిఖరాలు క్రింద స్తంభాగ్రాలకుపైన వున్నాయి వీటిపైన మొసళ్ళవరుస, దానిపై అంచు వున్నాయి ఈ అంచు అగ్రంకుడులా వుంది దానిలో దేవుడు కూర్చుని వున్నాడు

దక్షిణ, పశ్చిమ, వుత్తర గోడలు అన్నీ ఒక్కలాగే వున్నాయి వాటిలో వరుసగా 1 రెండు స్తంభాగ్రాలమధ్య అర, 2 రిసీడంగ్ రీసెస్, 3 రెండు స్తంభాగ్రాల మధ్య అర, 4. రిసీడింగ్ రీసెస్, 5. మకర తోరణంతో అలంకృతమైన మధ్య గూడు, 6. రిసీడింగ్ రీసెస్, 7. రెండు స్తంభాగ్రాల మధ్య



గోడగూడు—చంద్రశేఖరాలయం

అర, 8 రిసీడింగ్ రీసెస్, 9 రెండు స్తంభాగ్రాల మధ్య అర గోడగూళ్ళు సాదాగా వున్నాయి వాటిపై యేమీ శిల్పాలు లేవు 1, 9 విభాగాల పైన అడుగునుంచి పైకి ముక్కోణాకారంగల ఆమలకం, హాస్యభంగిమలలోనున్న మరుగుజ్జుల వరుస, మొసళ్ళ వరుస, కప్పువంటి సాదా కట్టడము, కుడువంటి అగ్రము, దానిమధ్య శిఖరము వున్నాయి ఈ శిఖరంలోపల మనిషితల, యిరుప్రక్కల పద్మలతలు వున్నాయి 5, 7 విభాగాలలో క్రిందనుంచి పైకి ముక్కోణాకారంగా వున్న ఆమలకం, ప్రతి స్తంభాగ్రానికి పైన లోపల అష్టదళ పద్మంగల శిఖరంతో కూడిన అంచు, కోసువాసం, వాసం కొసలుగల జ్లాకు, నాలుగు స్తంభాగ్రాలపైగల కట్టడము, కీర్తిముకుటంతో నాలుగు స్తంభాగ్రాల పైగల శిఖరం వున్నాయి యీ శిఖరం పైలోపల రెండు స్తంభాగ్రాలపైగల చిన్న శిఖరం ఒకటి వుంది మధ్య గూటి పైభాగంలో ముక్కోణాకారంగల ఆమలకం, మరుగుజ్జుల వరుస, పైన చెప్పినట్టిఅంచు, మకర ముఖాల వరుస, కప్పువంటి భాగములోపల లింగంగల శిఖరము వున్నాయి.

విమానం :- ఈ దేవాలయం విమానంపై క్రింది నుంచి పైకి 5 వరుసలు వున్నాయి మొదటి వరుసలో వరుసగా - లోపల నిల్చున్న దేవుడుగల కర్ణకుడు, అంతకంటె కురుచ కర్ణకుడు, లోపల దేవుడు



ఓపెన్ పోర్టికో—చంద్రశేఖరాలయం

గల శాల, కురుచ కర్ణకుడు, కర్ణకుడు. అలాగే రెండవ వరుసలో ఒక స్తంభాగ్రము, కర్ణకుడు, ఆలింగన భంగిమలో నున్న శివపార్వతులు గల శాల, కర్ణకుడు, స్తంభాగ్రాలు వున్నాయి మూడవ వరుసలో, కర్ణకుడు అగ్రం వుంది దానిపై మధ్యన కీర్తిముకుటం గలిగి రెండు స్తంభాగ్రాలను ఆపుచేసుకొని వున్న పెద్ద శిఖరంవుంది దీనిపైన పెద్ద పద్మం వుంది దాని మధ్యనుంచి కలశం పైకి వస్తున్నది

సెల్లా - తూర్పు గోడ మధ్యగల ద్వారంగుండా వెడితే సరాసరి సెల్లాలోనికి వెడతాము ఇక్కడ ముందు గది లేదు సెల్లా లోపల గ్రానైటు లింగం

వుంది. దాని ముఖంపై శ్రీ గుర్తు వుంది. లింగానికి ఉత్తరాన దేవీ విగ్రహం వుంది. ఆమె కుడి కాలును స్వల్పంగా వంచి నిల్చునివుంది. కుడిచేతిలో నల్ల కలువవుంది. ఎడమ చేతిని క్రిందకు వ్రేలాడ వేసుకున్నది.

## గోలింగేశ్వరస్వామి ఆలయం

ఈ దేవాలయం ఆవరణ మధ్యభాగంలో వుంది. ఇక్కడగల 3 దేవాలయాలలోను యిది మిక్కిలి పెద్దది. వాటికంటె చాలా ఎక్కువగా అలంకృతమైవుంది. దీని ముందర తూర్పు ముఖంగా విశాలమైన వేదికవుంది. అక్కడ ఒక దాని ముందు ఒకటి చక్కని నందివిగ్రహాలు మూడు వున్నాయి. వాటి వెనుక ధ్వజస్తంభంవుంది.



గోలింగేశ్వరాలయం

అడుగు భాగం:- ఈ దేవాలయం అడుగు భాగం రాజరాజేశ్వరాలయం అడుగు భాగంవలెనే వుంది.

గోడలు:- దేవాలయానికి ముందు ముఖమండపం లేక హాలువుంది. దానిముందు లేక తూర్పు గోడ యెట్టి శిల్పాలు లేక సాదాగావుంది. దక్షిణానగల మెట్లు యెక్కి యీ హాలుకి పైన గల డాబాలోకి వెళ్లవచ్చు. దక్షిణ, ఉత్తర దిశలగల గోడలపై వరుసగా, తూర్పునుంచి పడమరకి 5 స్తంభాగ్రాలు, గళ్ల (బెజ్జాలుగల) తెర, 6 స్తంభాగ్రాలు వున్నాయి. ముందుగది పక్కగోడలు రెండూ సాదాగావుండి, గళ్ల తెరను కలిగివున్నాయి. నైల్లాకు ఉత్తర, పడమర, దక్షిణదిశలగల 3 గోడలు నిర్మాణ శిల్పసఖ్యాలు, శిల్పాలతో బాగా అలంకరించబడ్డాయి. వాటిలో ఒక్కొక్క దానిపై వరుసగా 1. రెండు స్తంభాగ్రాల మధ్య శిల్పంతో గూడిన అర, 2. రిసీడింగ్ రిసెస్. దీనికి అడుగున ఒక ఏనుగ నిలబడివుంది. 3. రెండు స్తంభాగ్రాల మధ్యవుండి శిల్పంతో కూడిన అర. 4. అడుగున ఏనుగుగల రిసీడింగ్ రిసెస్. 5. పైన మకరతోరణం, లోపలశిల్పాలుగల గోడ గూడు. 6. అడుగున యేనుగుగల రిసీడింగ్ రిసెస్, 7. రెండు స్తంభాగ్రాల మధ్య శిల్పంతో కూడిన అర, 8. అడుగున యేనుగుగల రిసీడింగ్ రిసెస్, 9. రెండు స్తంభాగ్రాల మధ్య శిల్పంతోగూడిన అర. 1. 9 ల పై భాగంలో ఒక్కొక్క స్తంభాగ్రంపై ముక్కోణాకారంగల ఆమలకం ఒకటి వుంది. దానిపైనగల మరుగుజ్జుల వరుస పైకట్టడానికి ఆపుగావున్నది. అంచుకుపైన కీర్తిముకుటాలుగల శిఖరాలు వున్నాయి. వీటిలో మనిషి తలలు వున్నాయి. దీనిపైన మొసళ్ళవరుస వుంది. దీనిపై సన్నటి సాదా పట్టీవుంది. దీనిపై కుడువంటి అగ్రము దానిపై వెడల్పైన పైభాగం గల శిఖరము దానిలోపల దేవతా విగ్రహము వున్నాయి. 3, 7 భాగాలపైన ఒక్కొక్క స్తంభాగ్రంపైన త్రిముఖమైన ఆమలకము వుంది. దీనిపైన బాతుల వరుస వుంది, ఈవరుసపైగల అంచుపై ఒక్కొక్క స్తంభాగ్రానికిపైన వెడల్పైన పైభాగం గల రెండు శిఖరాలు వున్నాయి. లోపల అష్టదళ పద్మాలు వున్నాయి. అంచుకుపైన కోసువాసాలు బోనపు చివళ్లుగల విభాగం ఒకటి వుంది. పైన నాలుగు కురుచ స్తంభాగ్రాలపై ఒకఅర, దానిపై అట్టిదే మరొక అర వున్నాయి. పైన కీర్తిముకుటంతో కూడిన శిఖరం వుంది. మధ్యగూడుగల భాగానికిపైన ముక్కోణం ఆమలకం వుంది. దానిపై మరుగుజ్జుల వరుసవుంది. దీని పైఅంచు నిండా శిఖరాలు వున్నాయి. దీనిపైన మొసళ్ళ వరుస వుంది. దానిపై నాలుగు కురుచ స్తంభాగ్రాలవల్ల నాలుగు విభాగాలయిన అరవుంది. దీని పైనశాలపై కప్పువుంది. దాని మధ్య ఒక పెద్ద శిఖరం వుంది. దానిలోపల ఒక దేవుడు కూర్చుని వున్నాడు.

విమానం - ఈ దేవాలయం విమానం క్రింద నుంచి పైకి ఆరు విభాగాలుగా వుంది 1. రెండు స్తంభాగ్రాలపైగల కర్ణకుడు దానిలో ప్రణయ ఘట్టంలోనున్న దంపతులు వున్నారు 2 రెండు స్తంభాగ్రాలపై అంచు 3 రెండు స్తంభాగ్రాల పైశాల, లోపల ప్రణయాతురులైన దంపతులున్నారు పైన లింగంతో కూడిన శిఖరం వుంది 4 రెండు స్తంభాగ్రాలపై అంచు, రెండవ వరుస కూడా యిలాగే వుందికాని యింతకంటె సన్నంగా వుంది విగ్రహాలేమీ చెక్కబడలేదుకూడా దీనిపైన సన్నటి బల్లపరుపు పట్టీవుంది దాని నలుమూలల నంది విగ్రహాలు వున్నాయి. పైన కుడువంటి అగ్రం దానిపై పద్మంవున్నాయి. దీనికంతక్కీపైన కలశం వుంది.

హాలు:- హాలు లేక ముఖ మంటపం తరువాత కట్టబడినట్టు కనబడుతుంది. దీనిలో మూడేసి స్తంభాల వరుసలు రెండు వున్నాయి. ఈ హాలులో మూడు ఆలయాలున్నాయి. దక్షిణాన గల ఆలయంలో గణపతి, వుత్తరానగలవాటిలో పార్వతీదేవి, కుమారస్వామివున్నారు ఉత్తర, తూర్పు గోడల కోణంలో ఆలింగన భంగిమలోగల దేవీ చంద్రశేఖరులు వున్నారు. ఈ విగ్రహం చాల చక్కగావుంది.



భిక్షాటనమూర్తి-గోలింగేశ్వరాలయం ఉత్తరపు గోడ

ముందుగది:- ఇదిసన్నంగా, సాదాగావుంది.

సెల్లా:- సెల్లాలో ఆవల గోలింగేశ్వరస్వామి లింగంవుంది. దాని ముఖంపై శ్రీ గుర్తువుంది.

శిల్పాలు:- ఈ దేవాలయం తూర్పుగోడపై రెండు స్తంభాగ్రాలమధ్య అర్ధనారీశ్వరుని విగ్రహం వుంది. స్వామి కుడికాలును స్వల్పంగా వంచి నిల్చున్నాడు పై కుడిచేతిలో త్రిశూలము, పై యెడమ చేతిలో ఖట్వాంగము, క్రింద కుడిచేతిలో కపాలము వున్నాయి క్రింద యెడమచేయి కట్యావలంబిత భంగిమలో వుంది ఎడమవైపున ఒక వురోజం వుంది

ఉత్తరపుగోడపై దిగువ శిల్పాలు వున్నాయి :

భిక్షాటనమూర్తి - ఇది రెండు స్తంభాగ్రాల మధ్యగల మొదటి అరలోవుంది స్వామికి నాలుగు చేతులు వున్నాయి ఎడమకాలును స్వల్పంగా వంచి నిల్చున్నాడు పై కుడిచేతిలో పాత్ర, పై యెడమ చేతిలో శూలము వున్నాయి. శూలం భుజాలపై ఆనుకొనివుంది. క్రింద కుడిచేత్తో ఒక స్త్రీ యిచ్చే భిక్షాన్ని స్వీకరిస్తున్నాడుస్వామి. ఆ స్త్రీ కుడివైపున నిలబడివుంది. క్రింద యెడమచేతితో వరముపైగల ఖట్వాంగాన్ని పట్టుకున్నాడు.



మహిషాసురమర్దని-రాజరాజేశ్వరాలయం వుత్తరపు గోడ

గోదేవత:- ఈ శిల్పం రెండు స్తంభాగ్రాల మధ్యగల రెండవ అరలో వుంది. ఈ దేవత యెడమ కాలు ముణుచుకుని గూర్చునివుంది. కుడికాలు మోకాటివద్ద వంగి పైకి యెత్తివుంది. ఈమె కుడి చేతిలో నీల్లకలువ, యెడమచేతిలో పాత్ర వున్నాయి. ఆమె పొట్ట పెద్దదిగా వుంది. ఆమె కూర్చున్న పీఠాన్ని ఒక మరుగుజ్జు మోస్తున్నాడు.

మహిషాసురమర్దని:- ఈ శిల్పం గోడమధ్యగల గూటిలో వుంది. ఈమెకు ఆరు చేతులు వున్నాయి. కుడికాలునుచాపి, యెడమకాలును మహిషంపై మోపి నిల్చునివుంది. కుడి చేతులలో ఒకదానిలో కత్తివుంది. ఆ చెయ్యి తలకుపైన వుంది. మరొక దానిలో ఖట్వాంగము వుంది. మూడవదానితో మహిషం శరీరంలోనికి త్రిశూలాన్ని దూనుపుతున్నది. ఆ మహిషశరీరంలోనుంచి ఒక మనుష్యుడు లేచి వస్తాడు. అతని కుడిచేతిలో కత్తి, యెడమచేతిలో డాలువున్నాయి.

చాముండేశ్వరి:- ఈ శిల్పం రెండు స్తంభాగ్రాల మధ్యగల అరలో వుంది. ఈమెకు ఆరు చేతులు వున్నాయి. ఎడమకాలు ముడుచుకుని కూర్చుని వుంది. కుడికాలు మోకాటి వద్ద వంగి పైకి యెత్తి వుంది. చేతులలోనున్న ఆయుధాలు శిథిలమై పోయాయి. ఒక యెడమ చేయి తర్జనిభంగిమలోవుంది. దేవి దిగువన ఒక శవంవుంది. దానిని రెండునక్కలు పీక్కుతింటున్నాయి.



ఏకపాదశివుడు—గోలింగేశ్వరాలయం పడమరగోడ

దేవత :- రెండు స్తంభాగ్రాల మధ్యగల గదిలో వున్న యీ శిల్పం ఒక దేవతఅయి వున్నది. ఆమె కుడికాలును స్వల్పంగా వంచి ద్విభంగిమలో నిలబడి వుంది. కుడిచేతిలో పాత్ర, యెడమచేతిలో ఖట్వాంగము వున్నాయి. కుడివైపున ఒక స్త్రీ నిలబడి వుంది.

## పడమర గోడపై దిగువ శిల్పాలు వున్నాయి

ఏకపాద శివుడు :— రెండు స్తంభాగ్రాల మధ్యగల అరలో వుందియీ శిల్పం. ఈ స్వామికి నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో పాత్ర, పై యెడమచేతిలో ఖట్వాంగము వున్నాయి క్రింద చేతులలో గల వస్తువులు శిథిలమై పోయాయి.

దేవత :- ఈ విగ్రహం రెండు స్తంభాగ్రాల మధ్యగల అరలో వుంది. ఆమె కూర్చుని వుంది. ఆమె తలకి పైన మూడు పాముపడగలు వున్నాయి.

కుమారస్వామి :- ఈ శిల్పం గోడమధ్య గల గూటిలో వుంది. ఈయన సమభంగంలో నిల్చుని వున్నాడు. ఎడమ చేతిలో బాణము, కుడిచేతిలో నెమలి పురి వున్నాయి.

బ్రహ్మ:- ఇదిరెండు స్తంభాగ్రాల మధ్య అరలోవుంది. ఆయనకు మూడు తలలు వున్నాయి. కుడిచేతిలో అక్షమాల, యెడమ చేతిలో కమండలము వున్నాయి. పాదతలాన్కి యిరువైపులా ఒక్కొక్క భక్తుడు వున్నాడు.



బ్రహ్మ—అదే ఆలయంలో అదేగోడ

దేవుడు :- ఈయన యెడమకాలు ముడుచుకుని కూర్చున్నాడు. కుడికాలు మోకాటివద్ద వంగి పైకి యెత్తివుంది. కుడిచేతిలో పాత్ర వుంది. క్రింద మేకలాగున్న జంతువు వుంది. ఇది రెండు స్తంభాగ్రాల మధ్యగల గదిలో వుంది.

కంకాళ మూర్తి :- ఇది రెండు స్తంభాగ్రాల మధ్యగల అరలో వుంది. ఈయన యెద్దుపై నిల్చుని వున్నాడు. కుడివైపున ఒక దాసి వుంది. ఆయన కుడిచేతిలో కంకాళ దండవుంది. ఎడమచేయి కట్యావలంబితగా వుంది.

ఇంద్రుడు :- ఇది గోడ మధ్యగల గూటిలో వుంది. ఈయన యెడమకాలును స్వల్పంగా వంచి

నిల్చున్నాడు. ఇరు పక్కల ఒక్కొక్క సేవకుడు వున్నాడు ఈయన కుడిచేతిలో వజ్రం వుంది యెడమచేయి కట్యవలంబితగా వుంది ఆయన మకుటం నుంచి పక్కలకి రెండు కొమ్ములు వస్తున్నాయి

సూర్యుడు - సుఖంగా కూర్చుని వున్నాడు రెండు చేతులలోను పద్మాలు వున్నాయి ఈశిల్పం రెండు స్తంభాగాల్రిల మధ్యగల అరలో వుంది



విష్ణుమూర్తి.- ఈ శిల్పం రెండు స్తంభాగ్రాల మధ్యగల అరలో వుంది. ఈయన నిల్చుని వున్నాడు. కుడిపక్క ఒక సేవకుడు వున్నాడు. ఈయన పైకుడిచేతిలో చక్రము, పై యెడమ చేతిలో శంఖము, క్రింద యెడమ చేతిలో గద వున్నాయి. క్రింద కుడి చేయి వరదముద్రలో వుంది.

సూర్యుడు - గోలింగేశ్వరాలయ దక్షిణకుడ్యం

సూర్యుడు -ఈయన నిల్చుని వున్నాడు రెండు చేతులలోను ఒక్కొక్క పద్మంవుంది ఇరుపక్కలా ఒక్కొక్క భక్తుడు వున్నాడు ఆయనముందు సారధి అనూరుడు కూర్చుని వున్నాడు క్రింద అయిదు గుర్రాలు వున్నాయి

విగ్రహాలు - గోలింగేశ్వరాలయంలోను, దాని ఆవరణలోను అందమైన విగ్రహాలు యెన్నో వున్నాయి వాటిలో ముఖ్యమైనవి యివి

గణపతి - ఇది దేవాలయం ముఖ మండపంలోని చిన్న గూటిలో స్థాపించబడింది ఈయనకు నాలుగు చేతులు వున్నాయి ఎడమకాలు ముడుచుకుని కూర్చున్నాడు కుడికాలు మోకాటివద్ద వంగి పైకి



విష్ణుమూర్తి—అదేఆలయం అదే కుడ్యం

యెత్తివుంది. పై కుడి చేతిలో అక్షమాల, పై యెడమచేతిలో పరశువు, క్రింది కుడిచేతిలో టంక, క్రింది యెడమ చేతిలో ఖండ్రాళ్లగిన్నె వున్నాయి. తలపై వింతయైనమకుటం వుంది దానిమధ్య కీర్తి మకుటం వుంది దానికిగల మూడు ముత్యాలచేరులు నుదురు మూడు వైపులకు పడుతున్నాయి నోరు కుడివైపునుంచి యేక దంతం వచ్చింది

ఆలింగన చంద్రశేఖరుడు - శివపార్వతుల యీ విగ్రహం ముఖమండపంలోకూడా వుంది శివుని పై కుడిచేతిలో త్రిశూలం వుంది. పై యెడమచేయి మోచేతివద్ద వంగి, దేవి కుడిభుజంమీద ఆనివుంది. క్రింద కుడిచేయి అభయ ముద్రలో వుంది. క్రింద యెడమచేయి దేవి వెనుక నుంచివచ్చి ఆమె నడుం చుట్టూ వుంది పార్వతీదేవి యెడమచేయి కట్యవలంబితగా వుంది కుడిచేయి స్వామి వెనుకకు వెళ్ళింది



కుమారస్వామి—అదేఆలయం పశ్చిమ కుడ్యం

కుమారస్వామి - ఇదికూడా ముఖమండపంలోని చిన్న ఆలయంలో వుంది ఈయన ద్విభంగిలో నిలచి వున్నాడు ఆయన వెనుక నెమలి నిలబడివుంది. ఆయన పై కుడిచేతిలో త్రిశూలము, పై యెడమ చేతిలో పాశము వున్నాయి. క్రింది కుడిచేయి అభయ

ముద్రలో వుంది. క్రింది యెడమచేయి నెమలి కంఠంపై వుంది.



శివుడు

శివుడు:- ఈయన యెడమకాలు ముణుచుకుని కూర్చున్నాడు. కుడికాలు వ్రేలాడుతూ క్రింద నందిపై మోపివుంది. పైకుడి చేతిలో అక్షమాల,



కుమారి

పై యెడమ చేతిలో త్రిశూలము వున్నాయి. క్రింది కుడిచేయి కర్తరిహస్తంలోవుంది. క్రింది ఎడమచేయి యెడమతొడపై వుంది.

కుమారి:- ఇది గోలింగేశ్వరాలయం ముందుగది, సెల్లాల మధ్య వుంది. ఈమె ఎడమకాలు ముణుచుకుని కూర్చునివుంది. కుడికాలు వ్రేలాడుతూవుండి నెమలిపై మోపివుంది. ఈమెకు నాలుగు చేతులు వున్నాయి. పైకుడి చేతిలో వజ్రము, పైయెడమ చేతిలో పాశము వున్నాయి. క్రింద కుడిచేయి అభయ ముద్రలో వుంది. క్రింద యెడమచేయి ఒడియెడమ భాగంపై మోపివుంది. చేతిలో యేదో గుండ్రని వస్తువువుంది.



చాముండేశ్వరి

చాముండేశ్వరి:- ఇదిపై విగ్రహానికి పక్కనివుంది. ఈమె యెడమకాలు ముణుచుకుని కూర్చునివుంది. కుడికాలు క్రిందకు వ్రేలాడుతున్నది. ఈమెకు నాలుగు చేతులు వున్నాయి. పైకుడిచేతిలో ఖట్వాంగము, పైయెడమచేతిలో నాగము క్రింద కుడి చేతిలో పాత్ర, క్రింది యెడమ చేతిలో ఖడ్గము వున్నాయి. దిగువన నక్కలు పీక్కుతినే శవంవుంది.

కుమారస్వామి:- ఈ విగ్రహం ధ్వజస్తంభానికి ముందర దేవాలయానికి దక్షిణానగల గుడిలో స్థాపించబడింది. ఈయన ద్విభంగిలో నిలబడివున్నాడు. వెనుక వైపున నెమలివుంది. ఆయనపై కుడిచేతిలో త్రిశూలము, పైయెడమచేతిలో పాశమువున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలో వుంది. క్రింది యెడమచేయి నెమలికంఠం మీద వుంది.

# రాష్ట్రంలో పీచు పరిశ్రమ

రాష్ట్రంలో శ్రీకాకుళం, తూర్పు, పశ్చిమగోదావరులు, నెల్లూరు జిల్లాల్లో 96,300 యెకరాల భూమిలో కొబ్బరితోటలు పెరుగుతున్నాయి. ఆయా జిల్లాల్లో యీ తోటలక్రింద వైశాల్యం వివరాలు దగ్గరగా యివి :

| | | |
|---|---|---|
| 1. శ్రీకాకుళం | 21,000 | యెకరాలు |
| 2. తూర్పుగోదావరి | 56,900 | ,, |
| 3. పశ్చిమగోదావరి | 10,000 | ,, |
| 4. నెల్లూరు | 7,300 | ,, |

పై జిల్లాల కొన్ని ప్రాంతాలలో ముఖ్యంగా శ్రీకాకుళం, తూర్పుగోదావరి జిల్లాల్లో పీచును నానబెట్టుటకు కూడా సౌకర్యాలు వున్నాయి. కాబట్టి యీ కోస్తా జిల్లాల్లో పీచు పరిశ్రమను అభివృద్ధి చేయుటకు అవకాశం వుంది.

ఈ ప్రాంతాలలో యీ పరిశ్రమ అభివృద్ధి చెందక పోవుటకు దిగువ అంశాలు కారణమై వున్నాయి :

1. కొబ్బరికాయల్ని తీసినతరువాత నెల్లాళ్ళ వరకూ వాటిని ఒలవరు. ఆ తరువాతకూడా వాటిని పూర్తిగా ఒలవరు. ఇందువల్ల పారిశ్రామిక వుపయోగానికై 100 కి 60 వంతుల డొక్కలు మాత్రమే లభిస్తాయి.

2. ఈ ప్రాంతాలలో కట్టెలు చాలా ప్రియంగా వుండుటవల్ల కొబ్బరిడొక్కలలో చాలభాగం యెండబెట్టబడి వంటచెరకుగా వుపయోగింపబడతాయి.

కాబట్టి పీచు పరిశ్రమ అభివృద్ధి చెందాలంటే పై అలవాట్లను క్రమేపీ మార్చవలసివుంటుంది. ఈ ఆశయసిద్ధికై, రాష్ట్రప్రభుత్వంపై ప్రదేశాలలో యిదివరకే పీచు పాఠశాలలను, వుత్పత్తి - శిక్షణా కేంద్రాలను ప్రారంభించింది. అక్కడ యేటా చాలమంది అభ్యర్థులకి డొక్కలనుంచి పీచు తీయడం నేర్పబడుతున్నది. పీచుచాపలు, బ్రష్ చాపలు, త్రాళ్లు మున్నగు పీచు వస్తువుల తయారీ కూడా నేర్పబడుతున్నది.

ఒక్కొక్క జిల్లా పీచు పరిశ్రమ వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి :

## శ్రీకాకుళం జిల్లా

ఈ జిల్లాలో దగ్గరగా 21,000 యెకరాల భూమి కొబ్బరితోటల క్రింద వున్నది. తీరప్రదేశంలోను, మహేంద్రతనయ నది ముఖద్వారం వద్దను పీచును నానబెట్టుటకు సౌకర్యాలు వున్నాయి.

పీచు తయారీ పద్ధతిని మార్చి, తద్వారా నాణ్యమైన పీచును తయారు చేయుటకు, పీచుపరిశ్రమ అభివృద్ధిపట్ల ప్రజలకు ఆసక్తి కలిగించుటకు మద్రాసు ప్రభుత్వం 1946 లో బారువలో పీచు ప్రదర్శన యూనిట్టు నొకదానిని ప్రారంభించింది. 1948 లో అది శిక్షణా పాఠశాలగా మార్చబడింది. ప్రస్తుతం అక్కడ యేటా జాలరి మున్నగు వెనుకబడిన జాతులకు చెందిన 9 మందికి శిక్షణ యివ్వబడుతున్నది. వారికి రూ. 20 స్టైపెండు యివ్వబడుతుంది. ఇక్కడ పీచు నుంచి త్రాళ్లు, సాదా చాపలు, రకరకాల అల్లికలు గల చాపల వరకూ అనేక పీచు వస్తువులు తయారవుతున్నాయి.

బారువలోని ప్రభుత్వ పీచుపరిశ్రమ పాఠశాలలో వుత్పత్తివి భాగాన్ని ప్రారంభించుటకు 23-5-58 న ప్రభుత్వం ఆమోదించింది.

## తూర్పు గోదావరి జిల్లా

ఈ జిల్లాలో కొబ్బరి తోటలు పుష్కలంగా వున్నాయి అవి ఏటా దగ్గరగా 16 కోట్ల కొబ్బరి కాయలు కాస్తాయి. ఈ జిల్లాలో కొబ్బరి తోటలు దగ్గరగా 56,900 యెకరాల భూమిలో వున్నాయి. అవి ముఖ్యంగా డెల్టా తాలూకాలైన రాజోలు, అమలాపురం, కొత్తపేట తాలూకాలు మూడింటి లోను వున్నాయి. ఈ తాలూకాలు సముద్రతీరాన వున్నాయి వాటి గుండా గోదావరి పాయలు గౌతమి, వసిష్ఠ, కౌశికలు ప్రవహిస్తున్నాయి. డొక్కలను నానబెట్టుటకు సముద్ర తీరాన, గోదావరి, దాని పాయల తీరాలలోను వసతి వున్నది.

డొక్కలలో చాలభాగం వంటచెరకుగా వుపయోగింప బడినా కొన్ని ప్రదేశాలలో పీచునుంచి త్రాళ్లు తయారు చేతాబడతాయి ఇవి యెక్కువగా బోట్లకు, గృహ, వ్యవసాయ ప్రయోజనాలకు వుపయోగించ బడతాయి.

## అంతర్వేదిలో

ఈ జిల్లాలో పీచు పరిశ్రమ అభివృద్ధికి గల అవకాశాల దృష్ట్యా రాష్ట్ర ప్రభుత్వం అంతర్వేదిలో పీచునానుడు కేంద్రాన్ని, యారన్ యూనిట్టును నెలకొల్పుటకై 5-5-56 న ఆమోదించింది. ఇక్కడ నాణ్యమైన పీచునార వుత్పత్తి యగుచున్నది. ఈ కేంద్రం తన సరుకులను, ప్రభుత్వ కేంద్రాలకు, ప్రైవేటు సంస్థలకు కూడా అమ్ముతున్నది

## తాళ్ల రేవులో

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అభివృద్ధి కార్యక్రమం క్రింద, పీచు వస్తువుల తయారీకై వుత్పత్తి-శిక్షణా కేంద్రం స్థాపన మంజూరు చేయబడింది. పీచు తీయడం, పీచు వస్తువుల తయారీలో యిక్కడ 12 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వబడు తున్నది.

ఈ జిల్లాలో పీచు పరిశ్రమ అభివృద్ధికై పై రెండు సంస్థలు యెంతమాత్రం చాలవుఅని భావించబడి నందున మరి రెండు వుత్పత్తి - శిక్షణా కేంద్రాలను, ఒకటి అంతర్వేదికి సమీపంలోను, రెండవది కోమరగిరి పట్నంలోను, నెలకొల్పుటకు ప్రభుత్వం ఆమోదించింది.

## పశ్చిమగోదావరి జిల్లా.

ఈ జిల్లాలో పీచు పరిశ్రమ నర్సాపురం, భీమవరం తాలూకాలలో మాత్రమే నడపబడు తున్నది. అదైనా యించుమించు వుప వృత్తిగా అవలంబింప బడుతుంది.

యువకులకు శిక్షణ నిచ్చి, కార్మికులను యీ పరిశ్రమ వైపుకు ఆకర్షించుటకై మొగల్తుర్రులో ఉత్పత్తి - శిక్షణా కేంద్రాన్ని నెలకొల్పుటకు 18-4-1956 న ఆమోదించ బడింది పీచు వస్తువుల తయారీలో 12 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వబడు తున్నది





రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన సచార్ హైదరాబాదులో పురాతత్వ శాస్త్ర కేంద్ర సలహాసంఘం సమావేశాన్ని ప్రారంభించారు

# పురాతత్వశాస్త్ర విశేషాలు

"ఈ రాష్ట్రంలో నాగార్జున కొండవద్ద జరిగే త్రవ్వకం పనులను నేను స్వయంగా చూచే అవకాశం లభించింది నాగార్జున కొండస్థలం ఒక్క బౌద్ధ అవశేషాలకే ప్రసిద్ధిగాంచలేదు అది రాతియుగం నుంచి మధ్యయుగంవరకూ జరిగిన మానవ చరిత్రను పూసగ్రుచ్చినట్టు చెబుతుందికూడా ఇక్కడ జరిగిన త్రవ్వకాలవల్ల యీ విషయం వెల్లడిఅయింది అందుచేత యీ స్థలం యితర కారణాలచేతకూడా ప్రాముఖ్యంగలదే నీటి పారుదల ప్రాజెక్టు ఫలితంగా నాగార్జునకొండ పై భాగం మునిగిపోకుండా ఒక ద్వీపంలా తయారవుతుంది త్రవ్వకాలలో బయల్పడిన పురావస్తువులలో విశేష ప్రాముఖ్యంగల కొన్నిటిని తీసి ఆ కొండకొనపై పునర్నిర్మిస్తారనీ, 2 మరి కొన్ని ముఖ్యవస్తువుల స్కేల్ మోడల్సు తయారు చేస్తారనీ, 3 మిగిలిన అన్ని వస్తువులకు మినియేచర్ మోడల్సు తయారు చేస్తారనీ, 4 కొండమీద పురావస్తు ప్రదర్శనశాలను, యితర భవనాలను నిర్మించి, ఆవిధంగా ఆ స్థలం చరిత్రను ముందుతరాలకి భద్రపరుస్తారని తెలుసు కొనుటకు నాకు ఆనందంగా వుంది" అని హైదరాబాదులో 9-10-58 న జరిగిన పురాతత్వ శాస్త్ర కేంద్ర సలహాసంఘం 14 వ సమావేశంలో ప్రారంభోపన్యాసంచేసిన సందర్భంలో రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన సచార్ అన్నారు ఆయన యింకా యిలా అన్నారు

"ఈ సంఘం మళ్లీ మళ్లీ చేసిన సిఫార్సుల ననుసరించి వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు పురాతత్వ సంస్థ

లను నెలకొల్పినవి. మిగిలిన రాష్ట్రాలలో అట్టి సంస్థల స్థాపన విషయం ఆలోచనలో వున్నట్టు కన బడు తుంది. అయితే యీ విషయంలో తృప్తికర మైన అభివృద్ధి జరిగినట్టు కనబడదు. ఈ విషయంలో నా అభిప్రాయ మడిగితే, రాజ్యాంగం అమలులోనికి వచ్చుటకు ముందులాగే పురాతత్వ శాస్త్రాన్ని కేంద్ర విషయంగా చేయుట వాంఛనీయమని చెబుతాను, ఎందువల్ల నంటే, త్రవ్వకాలు మున్నగు వాటిలో యేది యెక్కువ ముఖ్యమైనదో తెలుసు కొనుటకేమి, మామూలుపనే, పరిశోధనలు యెక్కువ చక్కగా జరుగుటకు యేర్పాటు చేయుటకేమి కేంద్ర సంస్థకు యెక్కువ అవకాశాలు వుంటాయి. సాంకేతిక సిబ్బంది, పరికరాల వుపయోగం విష యంలో కూడా యెక్కువ విస్తృతమైన అవకాశం వుంటుంది. రాష్ట్ర ప్రభుత్వాలు తమ సిబ్బందిని బల పరుచుకో లేకపోతున్నా లేక పురాతత్వ శాఖ లను విడిగా యేర్పాటు చేయలేక పోతున్నా అందుకు గల కారణాలలో ధనాభావం ఒకటి. ప్రత్యేక శాఖలు వున్న చోట కూడా అర్హులైన మనుషులు, తగిన సాధన సంపత్తి లేక యిబ్బంది కలుగు తున్నది. ఆ పైన దీనిని కేంద్రానికి బదిలీ చేసినట్లయితే ఒకే పనిని పునరావృత్తం చేయడం చాలావరకు తప్పుతుందికూడా".

పూర్వంనుంచీ మనదేశంలో రాజకీయ, సాంస్కృతిక సంబంధాలుగల వివిధ ఆసియా దేశాలకు పురాతత్వ శాస్త్రజ్ఞుల వర్గాలను పంపే విషయాన్ని ప్రస్తావించి ఆయన యిలా అన్నారు: "మన దేశ చరిత్రను ఆసియా దృక్పథంతో చదువవలసిన అగత్యాన్ని గురించి నేను నొక్కి చెప్పనక్కరలేదు. పది మిషన్‌లను అన్నే సంవత్సరాలలో వేర్వేరు ఆసియా దేశాలకు పంపే విషయాన్ని కేంద్ర ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించినదని తెలుసుకొని చాల సంతోషించాను. ఇవి (మిషన్‌లు) మనకు విలువయిన సమాచారాన్ని తెలుపగల వనుటలో సందేహం లేదు.

"త్రవ్వకాలు, పురావస్తు పరిశీలనలు మున్నగు వాటికై ప్రభుత్వం విశ్వవిద్యాలయాలకు యితో ధికంగా సౌకర్యాలను కలిగిస్తుందని ఆశించ వచ్చునను కుంటాను. వీటివల్ల గడచిన మన దేశచరిత్ర తెలవటమే కాక దేశానికి ముఖ్యంగా కావలసిన భావైక్యత సిద్ధిస్తుంది కూడా. మన విశ్వ విద్యాలయాలలోను, విద్యాసంస్థలలోను మన సాంస్కృతిక చరిత్ర పరిశీలన పట్ల యెక్కువ శ్రద్ధ చూపాలనే విషయం అంగీకరించ బడింది. కాబట్టి విశ్వ విద్యాలయాలు యెక్కువగా పరిశోధనను జరపాలి. పురావస్తు పరిశీలనకై వాటికి ధారాళంగా గ్రాంట్లు యివ్వబడాలి."

## చరిత్రాత్మకమైన నగరం

కేంద్ర విజ్ఞాన శాస్త్ర పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీ హుమాయూన్ కబీర్ తమ అధ్యక్షోపన్యాసంలో యిలా అన్నారు:

"ఈ రోజు మనం చరిత్రాత్మకమైన హైదరాబాదు నగరంలో సమావేశ మయాం. భారత దేశంలో పేరు పెట్టబడిన కొన్ని నగరాలలో యిది ఒకటి. ఇక్కడ స్త్రీ సహజమైన ఒక లాలిత్యము, మంచి అభిరుచి కనబడతాయి. భారత దేశం ప్రపంచ సారమయితే హైదరాబాదు భారత దేశ సారం. ఇక్కడ యెన్నో సంస్కృతులు మేళవమై ఒక వుమ్మడి సంస్కృతిని సృష్టించాయి. ఇది ప్రపంచానికి భారతదేశం అందించిన ఫలం. ఇక్కడ నూతన జీవితం, నూతనయుగం కోర్కెల మధ్యనే మన ప్రాచీన ప్రబల శక్తులను, యిటీవల గడచిన మన చరిత్రను చూస్తాం. ఇక్కడ చరిత్ర కందని కాలము, చరిత్ర కూడా వర్తమాన భవిష్యత్తులతో చెట్టాపట్టాలు వేసుకుని నడుస్తాయి. ఈ సంఘం యిప్పుడు తన సమావేశానికై రాజధానికి దూరంగా వున్న చరిత్రాత్మకమైన యీ నగరాన్ని యెన్నుట గమనార్హమని నా అభిప్రాయం."

ఇంకా ఆయన యిలా అన్నారు : "ముఖ్యంగా ఎనిమిది రాష్ట్ర ప్రభుత్వాలు పురాతత్వ శాఖలు నెలకొల్పి నందుకు, త్వరలోనే అట్టి శాఖల ప్రారంభాన్ని గురించి మరి నాలుగు రాష్ట్రాలు ఆలోచిస్తున్నందుకు నాకు ఆనందంగా వుంది. ఈ

విషయంలో అవిత్వరలోనే సుముఖమైన నిర్ణయాన్ని చేస్తాయనీ, యింకా యీ విషయం గురించి ఆలోచించని రెండు రాష్ట్రాలు కూడా త్వరలోనే అలా చేస్తాయనీ ఆశిస్తాను. ఈ విధంగా మాకు పెక్కు రాష్ట్ర ప్రభుత్వాలు తమ కార్యకలాపాలను గురించి నివేదికలు పంపుతాయి. పేరు చెప్పను కాని ఒక్క రాష్ట్రం మాత్రం జరిగే సంవత్సరానికి తన నివేదికను పంపలేదు. రాష్ట్ర ప్రభుత్వాలన్నీ స్వంతంగా పురాతత్వ శాఖలను నెలకొల్పు కోవలసిన అగత్యాన్ని గుర్తించేట్లు, ప్రాచీన కట్టడాల రక్షణకై శాసనాలు చేసేటట్టు కృషి చేశానని అనుకొనే హక్కు యీ సంఘానికి కలదని భావిస్తాను.

"సమీక్షలో నున్న సంవత్సరం (1957-58) లో జరిగిన మరి మూడు అభివృద్ధులను గురించి ప్రత్యేకంగా పేర్కొనవచ్చు. మొదటిది, 1958 ప్రాచీన కట్టడాలు, పురాతత్వ స్థలాలు, అవశేషాల చట్టం. ఇది పెక్కు అసందర్భాలను తొలగించి మన తాజా శాసనాన్ని జార్యాంగం నిబంధనలకు అనురూపం చేసింది. ప్రైవేటు వ్యక్తుల అధీనంలో వున్న పురావస్తువుల రక్షణకు కూడా ప్రభుత్వానికి అవకాశం కల్పించే నిబంధన యీ సంఘానికి యిష్టం కాగలదని నమ్ముతాను.

"రెండవ అభివృద్ధి యేమిటంటే, జమ్మూ-కాశ్మీరు కట్టడాల స్వాధీనానికి తగిన యేర్పాట్లు పూర్తికావడం. ఇందుకు సంబంధించిన యేర్పాట్లు దాదాపు పూర్తి అయినవని యీ సంఘం గడచిన సమావేశంలో మౌలానా ఆజాద్ చెప్పారు. కాని పరిపాలనా సంబంధమైన కొన్ని చిక్కులవల్ల బదిలీకి యింతవరకూ వీలు కాలేదు. ఈ సంఘం వచ్చే సంవత్సరం సమావేశ మయినపుడు భారతదేశం యీ ప్రాంతంలోనిశాఖ కార్యకలాపాలను గురించి బాగా విపులంగా చెప్పగలమని ఆశిస్తాను.

"క్రిందటి సమావేశంలో యిష్టం లేకపోయినా పరిస్థితుల ఒత్తిడికి లోనై కేంద్ర పురాతత్వ గ్రంథాలయాన్ని ఢిల్లీనుంచి నాగపూరుకి మార్చుటకు అంగీకరించామని యీ సంఘ సభ్యులకు జ్ఞాపకం వుండి వుంటుంది. ఈ గ్రంథాలయం మొత్తం ఆసియాలోకే పెద్దది. దానిని భారతీయ పండితులే కాక విదేశాలవారు కూడా ప్రయోగించుకుంటారు. దీని విషయంలో మొదటి నిర్ణయాన్ని మార్చగలిగే మని చెబితే సభ్యులు సంతోషిస్తారని నమ్ముతాను. కేంద్ర పురాతత్వ గ్రంథాలయం పూర్వం వలెనే ఢిల్లీలోనే వుంటుంది. యిప్పుడు తుది నిర్ణయం తీసుకోబడింది.

"ప్రీ-హిస్టారిక్ పురావస్తు శాస్త్రంలో పరిశోధన చురుగ్గా కొనసాగు తున్నది. దీనిని గురించి స్వల్పంగా చెబుతాను. 15 సంవత్సరాలకు పూర్వం భారతీయ పురాతత్వ శాస్త్రజ్ఞులు ప్రీ-హిస్టారికల్ పరిశోధనను చేపట్టే వారేకాదు. అందుచేత యీ విషయం యిప్పుడు మరీ గమనార్హం. వింధ్య పీఠభూమి కొన్ని నదీ లోయలు, ఆంధ్రప్రదేశ్ నున్నపురాతి గుహలు, పంజాబు, తమిళనాడు కొన్ని ప్రాంతాలలోని నదుల యెగువ భాగాలలోను జరిగిన పరిశీలనలవల్ల భారతదేశపు మిక్కిలి ప్రాచీనమైన సంస్కృతుల కాలాల వరుస క్రమాన్ని నిర్ణయించ గలమనే ఆశ కలుగుతున్నది. ఈ విధంగా భారతదేశపు నేటి పురాతత్వ శాస్త్రపటము రాతి యుగపు స్థలాలతో నిండి వున్నది. ఇవి గడచిన దశాబ్దంలోనే కనుగొన బడినవి.

"సింధులోయ నాగరికత ప్రత్యేకం ఒక ప్రాంతానికి, స్థానిక కృషికి సంబంధించినది కాదని, అది భారతదేశంలో విశాల ప్రదేశాలకి వ్యాపించినదని నానాటికీ యెక్కువ స్పష్టంగా తెలుస్తున్నది. లోథల్ త్రవ్వకాలలో హరప్ప సంస్కృతికి చెందిన ముఖ్యమైన దాక్షిణాత్య ఔట్ పోస్టు బయల్పడింది. ఈ సంస్కృతీ కేంద్రాలు, దక్షిణాన నర్మదా, తపతీ నదుల మధ్యగల బోరిన్, సూరత్‌ల వరకూను, తూర్పున యమునానది శపనది హిండాన్ తూర్పు తీరం వరకూను కనిపించాయి. ఈ స్థావరాలు అసలు సింధుస్థలాలకు యెంతో దూరంగా వున్నా, మొహెంజోధారో, హరప్పాలలో కనుగొన్నట్టు అక్కడ నివసించిన ప్రజలు పట్టణ నిర్మాణం, ప్రజారోగ్యాల విషయంలో అవే సంప్రదాయాలను మన్నించారు. ఇది గమనార్హం.

"ప్రభుత్వశాఖ, విశ్వ విద్యాలయాల మధ్య సహకారానికి వుజ్జయిని, కౌశాంబిలలోని త్రవ్వకాలు చక్కని నిదర్శనం ఉజ్జయినిలో త్రవ్వకాలవల్ల అక్కడ చరిత్ర కాలానికి ముందు, చరిత్ర కాలం ప్రారంభ దశలలోను రక్షణపద్ధతిని గురించి యెన్నో ముఖ్య విషయాలు తెలిశాయి. అల్హాబాదు విశ్వ విద్యాలయం కౌశాంబిలో జరిపిన త్రవ్వకాలవల్ల ఆ ప్రాచీన నగరం విస్తృతమైన రక్షణ పద్ధతులలో ముఖ్యాంశాలు బయట పడ్డాయి.

"జరిగే సంవత్సరంలో యితర విశ్వ విద్యాలయాలు మున్నగు సంస్థలు కూడా ముఖ్యమైన పనిని చేశాయి. నవదతోలిలో దక్కన్ కాలేజీ పోస్టు-గ్రాడ్యుయేటు, పరిశోధక సంస్థ మొట్ట మొదటిసారిగా ప్రోటో హిస్టారిక్ చాకోలిథిక్ **(chalcolithic)** స్థలాన్ని పెద్ద యెత్తున త్రవ్వింది. కలకత్తా విశ్వ విద్యాలయం చంద్రకేతు ఘర్‌లో జరిపిన త్రవ్వకాల వల్ల తూర్పు ఇండియా చరిత్ర కాలానికి సంబంధించిన మంచి వివరాలు చిక్కాయి. కాశీ హిందూ విశ్వ విద్యాలయం రాజా ఘాట్‌లో జరిపిన త్రవ్వకాలవల్ల గంగానది లోయ చరిత్ర ప్రారంభ, ఆఖరి కాలాలకు సంబంధించిన దర్శనీయమైన అవశేషాలెన్నో బయల్పడ్డాయి.

"వైశాలిలో కె. పి. జయస్వాల్ పరిశోధక సంస్థ జరిపిన త్రవ్వకాలు ప్రత్యేకించి పేర్కొనదగినవి. అందులో ఒక స్థూపం దొరికింది. అది మౌర్యుల కాలానికి ముందుది. నిశ్చయంగా తెలియక పోయినా, బుద్ధుని నిర్యాణానంతరం ఆయన అవశేషాలపై నిర్మించబడిన సంప్రదాయ సిద్ధమైన 8 స్థూపాలలోను యిది ఒకటి అని అనుకోవచ్చు.

## సాటిలేని సంపద

"ఆఖరిని చెప్పినా చాలా ప్రధానమైన విషయం నాగార్జున కొండలో ప్రభుత్వశాఖ చేసిన పనిని చెప్పాలి. ఈ స్థలం ఒక్క బౌద్ధ అవశేషాలకే ప్రసిద్ధి కాదని రాతియుగం నుంచి మధ్యయుగం వరకూ జరిగిన చరిత్రను అది వరుస క్రమంగా తెలియ జేస్తుందని రానురాను బాగా స్పష్ట పడుతున్నది. రాతియుగం మున్నగు యుగాలకి సంబంధించిన వస్తువులు యిక్కడ లభించినంతగా మరెక్కడా లభించలేదు. శాతవాహన, ఇక్ష్వాక, చాళుక్య రాజుల పాలనల క్రిందివస్తువులు విడదీయ లేనంతగా కలిసిపోయి వున్నవిక్కడ. ఇక్కడ త్రవ్వకాలు జరుపుటేకాక నిర్ణీతమైన ప్రాచీన వస్తువులను మునిగి పోకుండా వుండే కొండ పై భాగానికి తరలించుటకు కూడా సమీతులోనున్న సంవత్సరంలో చర్య గైకొన బడింది. ఇక్కడ పురావస్తు ప్రదర్శన శాల నిర్మాణం సంకల్పించబడిన విషయం సభ్యులకు విదితమే. ఇక్కడ సాధ్యమైనన్ని అసలు వస్తువులు భద్రపరచ బడతాయి. కదలించుటకు వీలులేని వస్తువుల నమూనాలు తయారుచేసి భద్ర పరచ బడతాయి.

"వివిధ ప్రాంతాలలో విశ్వ విద్యాలయాలు, స్వతంత్ర సంస్థలు త్రవ్వకానికి పూనుకోడం హర్షణీయం. కేంద్రీకృతమైన అట్టి కృషి ద్వారానే విస్తార ప్రదేశాలను పరిశీలించి భారతదేశ చరిత్రకు సంబంధించి యింతవరకూ తెలియని విషయాలను తెలుసు కొనుట సాధ్యపడు తుంది. అపైన యిట్టి సందర్భాలలో స్వచ్ఛంద కృషి తక్కువ ఖర్చుతో జరిగి యెక్కువ ఫలితాలను యిస్తుంది. అట్టి సంస్థలు సహజంగా ఆర్థిక, తదితర సహాయాలకై కేంద్ర ప్రభుత్వం మీద ఆశ పెట్టుకొంటాయని నాకు తెలుసు. కాని వారి కోర్కెలు యెల్లప్పుడూ పూర్తిగా తీరవని నేనంటే మీరు అపార్థం చేసుకోరని ఆశిస్తాను. మేము మాకుగల ధనం, సాంకేతిక సిబ్బంది ననుసరించి సాధ్యమైన సహాయం చేయడానికి ప్రయత్నిస్తాం. కాని అట్టి అనధికార సంస్థలు యెక్కువ తమ కాళ్లమీద తాము నిలబడాలని వుద్బోధిస్తాను.

దేశంలో పురాతత్వ విషయకంగా జరిగిన పని వివరాలు హిందీలో కూడా ప్రకటింప బడాలని గడచిన సమావేశంలో కోరబడింది ఈ విషయంలో కొంత వరకూ చర్య గైకొన బడింది. భవిష్యత్తులో, వరుస తప్పకుండా అవి హిందీలో ప్రకటింపబడేలా చూస్తాం. దేశంలో పురావస్తు సంబంధమైన పనిని గురించి ప్రజలకు తెలిసేలా యించుమించు 64

పేజీల సమాచారాన్ని తయారు చేయమని కూడా నేను డైరెక్టరు జనరల్‌ని అడుగుతున్నాను. ఈ సంఘం మళ్ళీ సమావేశమును యేటేటా యిది భారతీయ భాష లన్నిటిలోను ప్రకటింపబడుతుందని ఆశిస్తున్నాను. ప్రచురణలకయ్యే ఖర్చులో కొంత భాగాన్ని కేంద్ర ప్రభుత్వం భరిస్తుంది. కాని యీ బోర్డు సభ్యులు డైరెక్టరు జనరల్‌తో సహకరిస్తేనే యీ పథకం జయప్రదం కాగలదు. వారు తమతమ రాష్ట్ర ప్రభుత్వాలు, విశ్వ విద్యాలయాల నుంచి ఖర్చులో కొంత భాగాన్ని సంపాదించాలి. వచ్చే సంవత్సరం నుంచి ప్రజల వుపయోగార్థం యేటా భారతీయ భాష లన్నిటిలోను నివేదికలు ప్రకటింపబడితే బాగుంటుంది.

"ఒక విషయంలో నేను వేత్తలయిన యీ సంఘ సభ్యుల సలహాను అర్థిస్తున్నాను. ఈ నాడు యించుమించు 4,000 పురా వస్తువులు కేంద్ర జాబితాలో వున్నాయి. పురావస్తువులు, స్థలాల ప్రాముఖ్యం హెచ్చుగా తెలియుటతో యివి యింకా యెక్కువయ్యే అవకాశం వుంది. రాష్ట్ర ప్రభుత్వాల క్రింద వుండవచ్చిన పురావస్తువులు తక్కువగా వుంటున్నాయని, అవిఅంత ప్రాముఖ్యమైనవిగా వుండుట లేదని యీ సంఘ సభ్యులు అప్పుడప్పుడు ఫిర్యాదు చేస్తున్నారు. బీహారులో రాష్ట్ర ప్రభుత్వం క్రింద చిన్నరకం పురా వస్తువులు 18 మాత్రమే వున్నాయిట. అవి అంత ముఖ్యమైనవి కావుట. ఇందువల్ల రాష్ట్ర ప్రభుత్వాలు పురాతత్వ శాఖలను యేర్పాటు చేయుటకు ప్రోత్సాహం కలుగడం లేదని కొందరు భావిస్తున్నారు. ఒక వంక కేంద్ర ప్రభుత్వంవద్దగల పురావస్తువుల సంఖ్య పెరిగి పోతున్నది. వీటి విషయంలో కేంద్ర పరిపాలన అసాధ్యం కావచ్చు కూడా. కాబట్టి కేంద్ర జాబితాను అప్పుడప్పుడు పరిశీలించి అధిక ప్రాధాన్యం గల పురా వస్తువులను, స్థలాలను మాత్రమే డైరెక్టరు జనరల్ అధ్వర్యం క్రింద వుంచితే బాగుంటుందని సూచించ బడింది. మిగిలిన వాటిలో కొన్నిటిని రాష్ట్ర ప్రభుత్వాలు భద్రపరచ వచ్చు. అట్టి యేర్పాటుతో ప్రతి రాష్ట్రానికి గల పురాతత్వ శాఖకు చేతినిండా పని వుంటుంది. అప్పుడు వాటి వునికి సార్థక మవుతుంది. చరిత్రాత్మకంగా అంత ప్రాముఖ్యం లేని వాటిని, అంత భద్రపరచ వలసిన స్థితిలో లేని వాటిని కొన్ని నిర్దిష్టమైన షరతులకు లోబడి విశ్వ విద్యాలయాలకు, అనధికార సంస్థలకు అప్పగించ వచ్చు. కొన్ని సందర్భాలలో వాటిని కొంత వరకూ భద్ర పరచి, కొంతవరకూ అవి అసలు నెలకొల్పబడిన ప్రయోజనాలవంటి ప్రయోజనాలకై వుపయోగించ వచ్చు. ఇందువల్ల స్థానిక ప్రాముఖ్యంగల పురా వస్తువులను యెక్కువగా భద్ర పరుచుటకు, ఆ విషయంలో స్థానికుల శ్రద్ధా సక్తులను చూరగొనుటకు వీలు పడుతుంది.

"ఢిల్లీలో ఖోలీ భటియరీకా మహల్ అనే పాత కట్టడం ఒకటి వుంది. ఇది ఫిరోజ్ తుగ్లక్ యెంతో యిష్టంగా వాడుకునే వేట నివాసమని విశ్వసించ బడుతున్నది. నేడు యిక్కడ కేవలం కొన్నిగోడలు మాత్రమే మిగిలి వున్నాయి. నిజానికి యిక్కడ భద్రపరచ వలసిన దేమీలేదు. అది భద్రపరచ బడిన స్థలమని తెలియచేయుట కక్కడ ఒక నీలం నోటీసు బోర్డు మాత్రం వుంచబడింది. దానిని రవాణా మంత్రిత్వ శాఖకిగాని లేక గుర్తించబడిన అనధికార సంస్థకు కాని అప్పగించి, అక్కడ అంతర్జాతీయ యువజన వసతిగృహమో లేక ఆకర్షణీయమైన యాత్రికుల కేంద్రాన్నో నడపమంటే బాగుంటుంది.

"భద్ర పరచిన పురా వస్తువులను పండుగలు, ప్రత్యేక వుత్సవాల సందర్భంలో వాడ్డం విషయంలో కూడా నేను యీ సంఘం సలహాను తెలుసుకో దలిచాను. ఇనస్పెక్టరు జనరలు యిటీవల యూరప్ వెళ్ళినప్పుడు యిట్టి పురా వస్తువులు ఇటలీ, జర్మనీ లలో యెలా వుపయోగించ బడుతున్నవో ప్రత్యేకించి పరిశీలించమని నేను చెప్పాను. ఈ దేశాలలో ప్రాచీన కట్టడాలు చాలా వున్నాయని మీకు జ్ఞాపకం వుందనుకుంటాను. రోమ్ లో పాతవి, కొత్తవి ఒకదాని పక్క ఒకటి వుండుట నేను చూశాను. జాతీయ పర్వదినాలలో పాత కట్టడాలలో కొన్ని వుపయోగించ బడతాయి.

"ఈ నాడు మనం దేశపు గత చరిత్రను తెలుసు కొనుటకు, కొత్త చరిత్రను సృష్టించుటకు కృషి

చేస్తున్నాం. ముప్పది సంవత్సరాల క్రిందట హిందూదేశ చరిత్ర ప్రారంభం కొన్నివేల సంవత్సరాల వెనుకకు నెట్టబడినది. స్వాతంత్ర్యం వచ్చిన పిమ్మట, మన పూర్వ చరిత్ర తెలుసుకునే యీ కృషి బాగా తీవ్రంగా వేగంగా జరుగు తున్నది. కేంద్ర పురాతత్వ శాఖపని బాగా హెచ్చింది. పరిశీలన, త్రవ్వకాలు మున్నగు పనిని విశ్వ విద్యాలయాలు మున్నగు సంస్థలు జరుపు తున్నవి. మరొక వంక దేశం నూతన జీవిత విధానాన్ని నిర్మించే మహాకృషిలో లీనమై వున్నది. విజ్ఞాన శాస్త్రం, టెక్నాలజీ భూమిరేఖలనే మార్చి ప్రాచీన గ్రామాలను ఆనవాలు పట్టలేనంతగా మార్చి వేస్తున్నవి. తీవ్రమైన పరిణామాలు జరుగు తున్న యిట్టి సమయంలో మన పూర్వచరిత్ర నేర్పిన గుణపాఠాలను యెరిగి వుండుట మరీ అవసరం. పురాతత్వం మన ప్రయత్నాలకు, కార్యకలాపాలకు అర్థాన్ని, ప్రయోజనాన్ని యిచ్చి తద్వారా నేటి భాషన్నను అద్భుతంగా సరిచేస్తుంది.



# వన్యమృగాల ప్రాముఖ్యత

(శ్రీ టి. వి. సుబ్బారావు, ఎమ్. ఎస్. సి., బి. ఎస్. సి. (ఎడింబరో) ఫారెస్టు యుటిలైజేషన్ ఆఫీసర్)

అడవిమృగాలను గౌరవించుట మన మహా సంస్కృతీ సంప్రదాయానికి కొత్త యేమీకాదు. ఆవు, ఎద్దు, ఏనుగ, పులి, సింహము ఆఖరికి పాములకి కూడా మన ప్రాచీన వాఙ్మయంలో గౌరవస్థానం వుంది. పూర్వం అడవిమృగాలకు రాజరక్షణవుండేది; అనధికారంగా, విచక్షణారహితంగా వాటిని చంపిన వారు శిక్షింపబడేవారు. మన పూర్వీకుల ఆశ్రమాలు అడవిజంతువుల రక్షణస్థావరాలుగా పరిగణింపబడేవి. అక్కడ జంతువులు నిర్భయంగా సంచరించేవి. ఉత్తమోత్తమమైన మన సంస్కృతికి జన్మస్థలం యీ ఆశ్రమాలే.

యుగయుగాలుగా మానవులు వేటాడి ఆనందిస్తూనేవున్నారు. రాతియుగంలో మానవుడు ఆహార, వస్త్రాలకు యెక్కువగా అడవిమృగాలపై ఆధారపడ్డాడు. నాగరికత కొంతవరకూ అడవజంతువులపై ఒత్తిడిని తగ్గించింది. వేటతరువాత ప్రమాదంతో కూడిన ఆటగా గుర్తించబడింది. రాజులు, ప్రత్యేకార్హతగల కొందరు వ్యక్తులు మాత్రమే వేటాడేవారు. ఆధునిక వేట పద్ధతులు పూర్వపు వున్నత దర్మాలనుంచి దిగజారిపోయినవి; అడవులలో దొంగ వేట అడవిమృగాల ప్రాణానికి ముప్పుగా పరిణమించింది. హెచ్చే జనాభాకు నివాసస్థలంకోసం క్రమేణా అడవులను తగ్గించుట, మారుమూల ప్రదేశాలలో రాకపోకల సౌకర్యాల పెంపుదల, విధ్వంసక ఆయుధాలు శీఘ్రగాములైన ఆధునిక శకటాలు నీటివల్ల అడవిమృగాల సహజస్థావరం యిదివరకులా వాటికి రక్షణస్థావరంగాలేదు.

### గని

బ్రహ్మాండమైన వృక్ష, జంతు సంపదతో ప్రకృతి భారతదేశాన్ని ఆశీర్వదించింది. భారతదేశంలో కీటకాలు, పాములు, కప్పలు, పక్షులు, ఎలుకలు, ఉడుతల దగ్గరనుంచి మృగరాజైన సింహాలు, పెద్దపులులు, చిరుతపులులు, ఎలుగుబంట్లు, అడవిబర్రెలు, కణుజులు, చీటాలు, నల్లేళ్లు, జింకలు, నీలగిలు, అడవిపందులు మున్నగు జంతువులవరకు వున్నాయి. మన దేశంలో పేర్కొనదగిన మరికొన్ని జంతువులు యివి : అనాదిగా భారతీయ జీవిత సంస్కృతులతో సంబంధంగల గజరాజులు ఒంటికొమ్ము ఖడ్గమృగాలు, హిమాలయాల దంతంలేళ్లు వగైరా.

ఆంధ్రప్రదేశ్ లో అడవిమృగాలు సమృద్ధిగావున్నాయి. మన అడవులలో నేటికీ పెద్దపులులు, చిరుతపులులు, అడవిబర్రెలు, తోడేళ్లు, ఎలుగుబంట్లు, కణుజులు, చుక్కలలేళ్లు, నల్లదుప్పులు, అరిచేలేళ్లు, పెద్ద పెద్ద ఉడుతలు, నాలుగుకొమ్ముల దుప్పులు, అడవి పందులు, అడవికుక్కలు, అడవిగొర్రెలు, నీలంగులు, మొసళ్లు వగైరా జాతులు వున్నాయి. పక్షిజాతులలో అనేకరకాలబాతులు, నెమళ్లు, పుల్లామపిట్టలు, పాట్రిడ్జిలు మున్నగునవి వున్నాయి.

సుమారు ఒక దశాబ్దంనుంచి ఒక్క ఆంధ్రప్రదేశ్ లోనేకాక మొత్తం భారతదేశంలోనే వన్యమృగాలు శీఘ్రంగా అంతరిస్తున్నాయి. యుద్ధం ముగిసిన తరువాత యివి ప్రజలందరి దృష్టిని ఆకర్షించేటంత శీఘ్రంగా అంతరించనారంభించాయి.

ఆర్థికాది ప్రయోజనాల దృష్ట్యానేకాక ప్రకృతి ప్రసాదించిన సహజసంపదగా వన్యమృగాలను పరిరక్షించుకోవాలి మనం.

పెక్కు యితర దేశాలలో ఆఖరికి పిల్లలుకూడా జంతువులు, పక్షులపట్ల యెంతో శ్రద్ధతీసుకుంటారు. అక్కడ జంతుప్రపంచాన్ని గురించి యెన్నో పుస్తకాలు వున్నాయి. చాలమంది యేదో ఒక అపురూపమైన పక్షిని చూడటకై శ్రమతోకూడిన ప్రయాణాలు చేస్తారు. మనం చూచి ఆనందించుటకు అద్భుతమైన జంతువులు లేకపోయినట్లయితే మన జీవితం చప్పగా వైభవరహితంగా వుంటుందని మనం గ్రహించాలి.

## తులాదండం

ప్రకృతి తులామానం దృష్ట్యాకూడా వన్యమృగాలను పరిరక్షించుట అవసరం. జంతువులనుతినే జంతువులే లేకపోతే మొక్కలనుతినే జాతులు పెరిగిపోతాయి, ప్రకృతి అతిని సహించదు. మాంసాహారులు, కీటకాహారులు అయిన జంతువులు లేకపోయినట్లయితే క్రిమికీటక సమూహంమధ్య మనం యెప్పుడో మరణించివుందుము. కారణం అవి అతి త్వరగా వృద్ధిపొందడమే. ప్రకృతిశక్తులు శీఘ్రాభివృద్ధిని పొందే ప్రాణులను ఒక హద్దులో వుంచుతాయి.

సింహం, పెద్దపులి, చిరుతపులి మున్నగు క్రూర జంతువులను, పంటలను పాడుచేసే లేడి, పక్షిజాతులను పరిరక్షించుట యేమి వివేకమని కొందరు అన్నారు. కాని వివిధరకాల వన్యమృగాలు వున్నాయి. అంటే ప్రకృతి చేసిన యేర్పాటు అని మనం మరచిపోకూడదు. ప్రకృతి యెప్పుడు సృష్టిలో శక్తిని అన్నిచోట్ల సమానంగా వుంచుతుంది. ప్రతి జంతువు, పక్షి ఆఖరికి కీటకము కూడా మానవునికి వుపకరిస్తాయి. చేపలు, తాంబేళ్లు నీటిని శుభ్రంచేసి తద్వారా మానవునికి నీటివల్ల జబ్బులు రాకుండా కాపాడుతాయి. నక్కలు, రాబందులు పొలాలలోని అమేధ్య పధార్థాలను హరించి వాటిని శుభ్రంగా వుంచుతాయి. చాల పక్షులు ముఖ్యంగా వడ్రంగి పిట్ట, మామూలు పిచికలు వగైరా మానవుల ఆరోగ్యానికి, వ్యవసాయానికి, పశు సంతతి అభివృద్ధికి ఆటంకాలైన కీటకాలను భక్షిస్తాయి. మాంసాహారులైన క్రూర జంతువులు వ్యవసాయానికి, పశు సంతతికి శత్రువులైన జంతువులను రూపుమాపుతాయి. మానవ జోక్యంవల్ల కాని మరొక కారణంవల్ల కాని ప్రకృతి క్రమము తారుమారయిన నాడు తప్పక చిక్కు కలుగుతుంది. ఇంగ్లండులో కుందేళ్లను యెక్కువగా నిర్మూలించుటతో నక్కలు, తోడేళ్లు, కోళ్లను తినడం ఆరంభించాయి. భారత దేశంలో పెక్కుచోట్ల తోడేళ్లు పిల్లల్ని యెత్తుకు పోతూ వుంటాయి. ఇందుకు కారణమేమిటంటే, వ్యవసాయంకోసం యెక్కువభాగం అడవుల్ని నరికివేయడం. అడవుల నిర్మూలనతో వాటికి చాటి సహజా హారం లభించక వూళ్లకి యెగబడతాయి. అడవి పక్క గ్రామాలలో పశువులను కూడా యెత్తుకు పోబడుతూ వుంటాయి. దీనికి కారణమేమిటంటే, లేళ్లను విచక్షణా రహితంగా సంహరించడం. పెద్ద పులికి దాని సహజా హారమైన లేడిళ్లు దొరక్కపోతే ఆకలి తీర్చుకోడానికి అది మానవులను యెత్తుకుపోతుంది.

సింహం, చీటావంటి మృగాలు, కొన్ని చక్కని పక్షులు యించుమించు నశించాయి. కొన్ని జాతులు నశించుట లేక బాగా తగ్గిపోవుటే కాదు. అన్ని చోట్లా వన్యమృగాలు తగ్గిపోయాయి. సర్వ సామాన్యమైన జాతులు కూడా కంటికి కనబడ్డం లేదు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వన్యమృగ రక్షణకై కేంద్ర ప్రభుత్వం యెంతో ఆతృతతో చురుగ్గా పని చేసింది. కేంద్ర ప్రభుత్వ అటవీ నిర్వహణ కొత్త విధానం 1894 నుంచి అమలులో వున్న విధానంకంటె వన్య మృగాలకు యెక్కువ రక్షణను యిచ్చింది. ఈ కొత్త విధానం ఫలితంగా 1952 లో భారతీయ వన్య మృగాల సంఘం నెలకొల్ప బడింది, అది 1953 లో మైసూరులో ప్రారంభింప బడింది. ఈ భారతీయ వన్యమృగాల సంఘం ధర్మమా అని వన్యమృగ రక్షణోద్యమం వేగం

పెచ్చింది. భారతీయ కళా సంస్కృతుల పునరుద్ధరణతోపాటు, మన మహా సంస్కృతికి అనుగుణంగా వన్యమృగ రక్షణకు కూడా చర్య గైకొన బడుట అదృష్టమే.

జాతికి గనివంటి వన్యమృగాలను పరిరక్షించుటకు వాటి విలువను బోధించుట, ప్రచారము మిక్కిలి అవసరమని వేరే చెప్పడం అనవసరం.

## ఆంధ్రప్రదేశ్‌లో

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వన్యమృగ రక్షణకై చాలా శ్రద్ధ తీసుకుంటున్నది. వేట నిబంధనలను ఖచ్చితంగా అమలు జరుపుటకై గట్టి చర్యలు తీసుకొన బడుతున్నాయి. అపురూపమైన జంతు, పక్షుల వేట నిషేధించ బడింది. రాష్ట్రంలో యిప్పటికి 8 వేట మృగాల రక్షణ స్థావరాలు యేర్పరచ బడినవి. వాటి క్రింద 700 చ. మై. అడవులు వున్నాయి. ఇక్కడ మనిషి జోక్యం లేకుండా మృగాలు ప్రశాంతంగా జీవిస్తాయి. త్వరలోనే మరి మూడు రక్షణ స్థావరాలను నెలకొల్పాలని సంకల్పించ బడింది. ఊరికే రక్షణ స్థావరాలను స్థాపిస్తే చాలదు. ప్రజలలో వన్యమృగాల రక్షణపట్ల ఆసక్తి కలిగించాలి. దేశంలో వన్యమృగాల రక్షణపట్ల ప్రజలు శ్రద్ధ వహించిన నాడు మనకు మళ్లా వెనుకటి వున్నతస్థానం లభిస్తుంది. అంటే పలురకాల మృగజాతుల సంతతిని మిక్కిలి యెక్కువగా కలిగివుండుటే కాక వాటిని ప్రపంచంలో అన్ని దేశాలకంటె యెక్కువ జాగ్రత్తగా చూడ కలుగుతాము.

ఇక్కడికి వరుసగా మూడు సంవత్సరాలనుంచి వన్యమృగ వారం జరుప బడుతున్నది. వన్యమృగ రక్షణ అవసరాలను యింకా యెక్కువగా ప్రజలకు తెలియ జేయుటకై యిది జరుపబడు తున్నది.

జాతి సంపదను తరుగకుండా కాపాడి ముందు తరాలకు అందించుట సత్పౌరులుగా మన పవిత్ర కర్తవ్యమై వున్నది, కాబట్టి మనలో ప్రతి ఒక్కరు మళ్లీ యీ శపథం తీసుకొని వన్యమృగ రక్షణకై మన సేవను తిరిగి అంకితం చేయాలి. "బుద్ధుడు, గాంధీజీ జన్మించిన యీ దేశంలో జన్మించిన నేను మన అడవులు, నోరులేని అక్కడి ప్రాణికోటి బుద్ధిపూర్వకంగా, వృథాగా ధ్వంసం కాకుండా కాపాడుతానని శపథం చేస్తున్నాను."

—ఆలిండియా రేడియో
సౌజన్యంతో





కేంద్ర హోం శాఖామంత్రి పండిత్ జి వి పంత్ హైదరాబాదులో సనత్‌నగరంలోని పారిశ్రామిక కేంద్రాన్ని ప్రారంభించారు

## సనత్ నగరంలో

# కొత్త పారిశ్రామిక కేంద్రం

హైదరాబాదులో సనత్ నగరంలో యిటీవల పారిశ్రామిక కేంద్రం ప్రారంభం కావడంతో, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆశయాల సాధనలో మరొక ముఖ్యమైన అడుగు ముందుకుపడింది

చిన్న తరహా పారిశ్రామికుల ఆదాయ మార్గాలు తక్కువగా వుంటాయి ఫ్యాక్టరీ భవనం దగ్గరనుంచి పరికరాలు, పెట్టుబడి వరకూ అన్నీ వారే పెట్టుకొనుట కష్టం వారికి డబ్బు వున్నా ఫ్యాక్టరీలకు అనువైన స్థలాన్ని వెతికి సంపాదించుటకు యెన్నో ఆటంకాలు యెదురవుతాయి ఆ తరువాత మళ్లీ ప్లానులను మునిసిపలు లేక మరొక అధికారులచే ఆమోదింప చేయుట మరొక చిక్కు ఆ తరువాత విద్యుచ్ఛక్తి, నీటి సరఫరాల విషయం మరొక సమస్య, ఈ చిక్కులు, అందువల్ల కలిగే ఆలస్యాల వల్ల పరిశ్రమలను నెలకొల్ప దలచుకున్న వ్యక్తులు చాలమంది నిరుత్సాహపడిపోతారు యిక యిప్పటికే పరిశ్రమలను నడుపుతున్నవారి విషయంలో, తగిన వసతి సౌకర్యం లేక వారిలో పెక్కురు తమ పరిశ్రమలను దొరికిన యేదో ఒక చోట శిథిలావస్థలో నున్న నివాస గృహమో, వాసనకొట్టే మురికి పేటలో ప్రదేశమో నెలకొల్పుకుని నడుపుతున్నారు తరుచు వాటికి అద్దెకూడా యెక్కువగా వుంటుంది వర్కుషాపులో తగినంత స్థలం

వుండదు. కార్మికులకు వసతి సౌకర్యాలేమీ వుండవు. ఆమేరకు వారి సామర్థ్యం కొరవడుతుంది. ఆపైన ఆ పారిశ్రామికుడు లాభంవచ్చినా తన పరిశ్రమను విస్తరింప చేసుకోలేడు.

ప్రజలకు సంబంధించినంత వరకూ ఫలితాలు మరీ తీవ్రమైనవి. పట్టణాలు, నగరాలలో జనసంఖ్య పెరిగిపోతున్నది. నివాస ప్రాంతాలు పరిశుభ్రంగా వుండుటలేదు. ఎక్కడ చూసినా రొద. ఇందువల్ల వారి ఆరోగ్యం దెబ్బతినడం ఖాయం. పరిశ్రమలను నెలకొల్ప దల్చుకున్న వారికి పై చిక్కులను తొలగించుటకు, ప్రస్తుతపు చిన్నతరహా పారిశ్రామికులకు తోడ్పడుటకు నేడు పారిశ్రామిక కేంద్రాలు ప్రారంభింప బడుతున్నవి

## లాభాలు

పారిశ్రామిక కేంద్రం అంటే యేమీలేదు. కుటీరాలు, గృహాలు, స్థలాలు, నివాస కాలనీలను ఒక పద్ధతి ప్రకారం నిర్మించినట్లే ఫ్యాక్టరీలను కూడా నిర్మించి పారిశ్రామికులకు అద్దెకు యివ్వవచ్చు. అందువల్ల లాభాలు యివి.

1. చిన్నతరహా పారిశ్రామికుడు తనకున్న స్వల్ప పెట్టుబడిని వ్యయప్రయోగించి ఫ్యాక్టరీని నిర్మించుకోనవసరంలేదు.

2. ప్లానుల ఆమోదం, లైసెన్సుల సంపాదన, విద్యుచ్ఛక్తి, నీటిసరఫరా విషయాలలో ఉత్పన్నమయే చిక్కులను అతడు యెదుర్కోనవసరంలేదు

3. చక్కని స్థలంలో రోడ్లు, యితర రాకపోకల సౌకర్యాలు గల ప్రదేశంలో సిద్ధంగా వున్న ఫ్యాక్టరీ లభిస్తుంది

4. అక్కడ బ్యాంకి, తపాలా కార్యాలయం, టెలిఫోను, ఔషధశాల, ఆటస్థలాలు మున్నగు సౌకర్యాలు లభ్యమవుతాయి

పై సౌకర్యాలకు తోడు ప్రతి పారిశ్రామిక కేంద్రంలోను హీట్ ట్రీట్‌మెంటు, లోహ పరీక్ష, యెలక్ట్రో ప్లేటింగు, యెనామిలింగు టెక్నికల్ లైబ్రరీ మున్నగు పనులలో గూడా సామాన్య సౌకర్యాలువుంటాయి. వాటిని పరిశ్రమలు, వాణిజ్య శాఖ కాని లేక కేంద్ర ప్రభుత్వ చినతరహా పరిశ్రమల సర్వీసు సంస్థకాని యేర్పాటు చేయవచ్చు. ఏ ఒక్క పరిశ్రమ స్వంతంగా యిట్టి సౌకర్యాలను కలిగించుకోలేదు. ఆ పైన నాల పరిశ్రమలు ఒకే చోట వున్నందున అవి పరస్పరం సహకరించుకుని వ్యాపారం జరుపుకోవచ్చు. ఉదాహరణకు, సైకిలు విడి భాగాలను తయారుచేసే చిన్న పరిశ్రమ సమీపంలోనే వున్న ఎలక్ట్రో ప్లేటింగు లేక యెనామిలింగుయూనిట్టుచే తన వస్తువులకు తుది మెరుగులు దిద్దించవచ్చు అలాగే ఒక ఫౌండ్రీ దగ్గరలోనున్న ఈ యూనిట్లకు కావలసిన సరుకులను తయారు చేయవచ్చు. ఈ రకం వ్యాపారంవల్ల వుత్పత్తి ఖర్చు తగ్గి, ధరలు ఆకర్షణీయంగా మారుతాయి.

ఇట్టి కేంద్రాలలో పరిశ్రమలు ఒకటిగా నెలకొల్ప బడితే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నెలకొల్పిన ప్రత్యేక సంస్థలు చిన్న యూనిట్లకు తోడ్పడగలవు. ఉదాహరణకు, హైదరాబాదు చిన్నతరహా పరిశ్రమల సర్వీసు సంస్థ సనత్ నగరంలోని పారిశ్రామిక కేంద్రంలోని యూనిట్లకు అవసరమైన సాంకేతిక సేవ, సహాయాలను సమకూర్చగలదు. జాతీయ చిన్నతరహా పరిశ్రమల సంస్థ యీ యూనిట్లు అద్దెకొనుగోలు పద్ధతి పై ఆధునిక యంత్రాలు, పరికరాలు కొనుక్కొనుటకు సౌకర్యం కలిగిస్తుంది. ఈ యూనిట్ల సరుకుల విక్రయానికి కూడా వారి సంచార అమ్మకం వాన్‌లు, టోకు అమ్మకం డిపోలు మున్నగు వాటిద్వారా యేర్పాటు చేస్తుంది,

## ఆంధ్రప్రదేశ్‌లో

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద ఆంధ్రప్రదేశ్‌లో మొదట రూ 70 లక్షల అంచనా వ్యయంపై సనత్‌నగరం, విశాఖపట్నం, విజయవాడ, సామర్లకోట, నంద్యాలలో 5 పారిశ్రామిక కేంద్రాలను నెలకొల్పుటకు వసతి కల్పించ బడింది. వరంగల్లు, గుంతకల్లులలో కూడా పారిశ్రామిక కేంద్రాలను స్థాపించాలనే ప్రతిపాదనలు ఆలోచనలో వున్నాయి.

సామర్లకోట కేంద్రం కాకినాడ పైలట్ ప్రాజెక్టు పెద్దాపురం ప్రాజెక్టులను, పంద్యాల కేంద్రం 1953 సిరీస్ సమాజాభివృద్ధి కేంద్రానికి వుద్దేశించబడ్డాయి.

విశాఖపట్నం పారిశ్రామిక కేంద్రానికి రూ. 30.64 లక్షలు ఖర్చు కాగలవని అంచనా. అక్కడ మొత్తం 33 ఫ్యాక్టరీ భవనాలను (3 ఎ తరగతి, 6 బి తరగతి, 10 సి తరగతి, 14 డి తరగతి) నిర్మించాలని సంకల్పం.

విజయవాడ పారిశ్రామిక కేంద్రంలో రూ. 20 లక్షల వ్యయంపై 18 ఫ్యాక్టరీ భవనాలను (2, ఎ తరగతి, 4, బి తరగతి, 4, సి తరగతి, 8 డి తరగతి) నిర్మించాలి.

విశాఖపట్నం, విజయవాడ, సామర్లకోటలలో పని ప్రారంభమై ఫ్యాక్టరీ భవనాలు నిర్మించబడుతున్నాయి. జరిగే సంవత్సరం (1958-59) లో నూరు కేంద్రాలకు అవసరమైన యంత్రాలు, యితర పరికరాల కొనుగోలుకై మొత్తం రూ. 8 లక్షలు (విశాఖ కేంద్రానికి రూ. 4 లక్షలు, విజయవాడ కేంద్రానికి రూ 2.50 లక్షలు, సామర్లకోట కేంద్రానికి రూ 1.50 లక్షలు) కేటాయించబడినవి.

## సనత్‌నగరం కేంద్రం

హైదరాబాదుకి 7 మైళ్ల దూరంలో, సికిందరాబాదుకి 3 మైళ్ల దూరంలో గల సనత్‌నగరంలోని బహిరంగ స్థలం పారిశ్రామిక కేంద్రానికి ఆదర్శప్రాయమైన ప్రదేశం. అక్కడ పారిశ్రామిక కేంద్రం స్థాపనకై 50 ఎకరాల భూమి సంపాదించ బడింది. ఈ పథకం అంచనా ఖర్చు రూ. 30.13 లక్షలు. ఇక్కడ 31 యూనిట్లు (3 ఎ, తరగతి 16 బి తరగతి 12 సి, తరగతి) నెలకొల్ప బడాలని సంకల్పించబడింది. ఇవికాక యిక్కడ యీ కేంద్రం పరిపాలనా నిర్వహణభవనం, ఔషధశాల, కార్మిక సంక్షేమ కేంద్రం, క్రెచీ, క్యాంటీను, పార్కులు, తోటలు వగైరా వుంటాయి మొదటి అంచెలో మొత్తం 17 యూనిట్లను నిర్మించాలని సంకల్పించబడింది. ఆ ప్రకారం ఒక ఎ, తరగతి యూనిట్టు, 8 బి, 8 సి, తరగతి యూనిట్లు, నిర్మించబడినవి. వీటికి వరుసగా 8000 చ అ. 4000 చ. అ , 2,400 చ అ ల మేరకు వర్కుషాపు వసతి కలిగించబడింది. మిగిలిన 14 యూనిట్లు 2 ఎ, తరగతి, 8 బి, తరగతి, 4 సి, తరగతి—అభివృద్ధి పథకం రెండవ అంచెలో 1958-59 ఆర్థిక సంవత్సరం లోపున నిర్మించబడ గలవు.

టౌన్ ప్లానింగుశాఖకు, నగరాభివృద్ధి సంఘానికి చెందిన సమర్థులయిన నిర్మాతలు, సివిలు ఇంజనీరులతో సంప్రదించి నిర్మించబడ్డాయి, యీ ఫ్యాక్టరీ భవనాలు. కాబట్టిఅవి వసతి, వెల్తురు, మున్నగు విషయాలలో ఫ్యాక్టరీ నిబంధనలకు అనుగుణంగా వున్నాయి హైదరాబాదు చిన్నతరహా పరిశ్రమల సర్వీసు సంస్థ ఎలక్ట్రోప్లేటింగు, హీట్ ట్రీట్‌మెంటులకై ఒక సర్వీసు కేంద్రాన్ని నెలకొల్పుతున్నది. కాబట్టి ఈ పారిశ్రామిక కేంద్రంలో పరిశ్రమలను నెలకొల్పేవారికి యీ సర్వీసు అందుబాటులో వుంటుంది. ప్రతి యూనిట్టులోను ఫ్యాక్టరీభవనంతోపాటు కొంత ఖాళీస్థలంకూడా వుంచబడింది. ఇందువల్ల పరిశ్రమలు మరీ దగ్గరగా వుండవు. ఆ తరువాత కావాలంటే విస్తరించుకోడానికి అవకాశం వుంటుంది కూడా. సనత్‌నగరం పారిశ్రామిక కేంద్రంలో ముఖ్యాకర్షణ యేమిటంటే యీ 17 యూనిట్లలోను నియమింపబడగలరని భావించబడుతున్న 400 మంది కార్మికులు సనత్‌నగరంలో ప్రభుత్వం నిర్మించిన యిళ్లలో వుండవచ్చు. సనత్‌నగరం కాలనీ పథకం క్రింద యించుమించు 1220 యిళ్లు నిర్మించబడ్డాయి. పారిశ్రామికకేంద్రం కార్మికులకు తగినన్ని యిళ్ళను కేటాయించి వుంచమని పారిశ్రామికకేంద్రం అధికారులు రాష్ట్రప్రభుత్వాన్ని కోరారు. హైదరాబాదు, సికిందరాబాదు ప్రాంతాలు, సనత్‌నగరాలమధ్య రాకపోకల సౌకర్యాలను హెచ్చించుటకై సనత్‌నగరం మార్గంలో నడిచే బస్సుల సంఖ్య హెచ్చించబడుతుంది.

## హైదరాబాదులో అభివృద్ధి అవకాశాలు

ఆంధ్రప్రదేశ్ రాజధానీనగరం హైదరాబాదులో ప్రారంభించబడిన మొట్టమొదటి పారిశ్రామిక

కేంద్రంవల్ల ప్రస్తుతం నడిచే దిగువ పరిశ్రమల అభివృద్ధికి అద్భుతమైన అవకాశాలు ఉన్నాయి.

1 లైటు ఇంజనీరింగు
2. సైకిలు విడిభాగాలు.
3. వ్యవసాయ పరికరాలు.
4. కుట్టుమిషన్లు, విడిభాగాలు
5. తోలుపదును
6. డ్రాయింగు, లెక్కలు, సర్వేయింగు సాధనాలు

ఈ పరిశ్రమలన్నిటిలోను సైకిలు పరిశ్రమ చాల ప్రధానమైన స్థానాన్ని ఆక్రమిస్తుంది ఎందువల్లనంటే, హైదరాబాదులో వున్నన్ని సైకిళ్లు భారతదేశంలో మరెక్కడా లేవు. సైకిళ్లసంఖ్యకి సంబంధించినంతవరకూ అది ప్రపంచంలో కోపెన్‌హేగన్ తరువాత స్థానం ఆక్రమిస్తుంది. ఇందువల్ల యిక్కడ సైకిళ్ళు, సైకిలు విడిభాగాల తయారీ పరిశ్రమ బాగా అభివృద్ధిచెందే అవకాశం కలదని తెలుస్తుంది

ప్రస్తుతం 16 యూనిట్లు సైకిళ్లు, సైకిలు విడిభాగాలను తయారు చేస్తున్నాయి. ఈ కేంద్రంలో యిదివరకే నెలకొల్పబడిన సైకిలు యూనిట్లు కాక మరిరెండు యూనిట్లు - చక్రాల ఆకుల తయారీ యూనిట్టు ఒకటి, సైకిలు గొలుసు తయారీ యూనిట్టు ఒకటి—రెండవ అంచెలో భవనాలను కేటాయించవలసిందని దరఖాస్తు పెట్టాయి.

పైనచెప్పిన కొన్ని పరిశ్రమల విస్తరణకేకాక చిన్నతరహా విభాగంలో దిగువ 12 కొత్త పరిశ్రమలను అభివృద్ధి పరచుటకు అవకాశం వున్నదని వాడకం, సాధనసంపత్తిల పరిశీలన సూచిస్తున్నది

1 రంపంపొట్టునుంచి అట్టలు తయారీ
2 గాజు సామానులు.
3 రాతిపొట్టాలు.
4. వైద్యచికిత్స సాధనాలు
5. [illegible], ఎలక్ట్రికల్ ఆక్సెసరీలు, శాస్త్రపరికరాల కొయ్యభాగాలు.
6 ఇండస్ట్రియల్ ఫాసెనర్సు
7 విద్యుత్ మోటార్లు.
8. సింగల్, డబుల్, ట్రిపుల్ ఐరన్ క్లాడ్ స్విచ్ లు.
9. చేతి పనిముట్లు.
10. కత్తులతయారీ
11 ఎలక్ట్రిక్ వైరింగు డిప్పు.
12 అల్యూమిని బాక్సు.



ఆంధ్రప్రదేశ్ జిల్లాలు :

# నెల్లూరు

ఒకవాదం ప్రకారం 'నెల్లూరు' అనేమాట నెల్లి, వూరు అనే రెండు తమిళ పదాలవల్ల యేర్పడింది. ఇక్కడ నెల్లి అంటే వరి ధాన్యం, వూరు అంటే గ్రామం. రెండవవాదం ప్రకారం నల్ల, వూరు అనే పదాలవల్ల యేర్పడింది నల్ల అంటే మంచి, వూరు అంటే మళ్లీ గ్రామం అని అర్థం అంటే మంచి గ్రామం అన్నమాట

నెల్లూరుకి పూర్వ చరిత్రతో చాలవిధాలుగా సంబంధం వున్నది అక్కడక్కడ గల నిదర్శనాలు యిప్పటికీ మనని ఆకర్షిస్తాయి. ఉదాహరణకి, నెల్లూరు చెరువు వుత్తరపు గట్టున యిప్పటికీ ఒక చిన్న దేవాలయంవుంది ఇది యిప్పుడు పురాతత్వ శట్టడంగా భద్రపరచబడింది ఇది ఇరుగులమ్మగుడి ఇది యీ జిల్లాలో మిక్కిలి పురాతనమైన వాటిలో ఒకటి. ఇక్కడ ఒక పాత శాసనం వుంది అది కనీసం పదకొండు శతాబ్దాల వెనుకటిది అయివుండాలి. దేవాలయం పోషణకై నెల్లూరు యీవత్తూ దానికి కానుకగా యివ్వబడింది అని యీ శాసనం పేర్కొంటున్నది

నెల్లూరు కనీసం పది శతాబ్దాల వెనుకటిది ఈ ప్రదేశాన్ని సందర్శించిన ఫ్రెంచి యాత్రికుడొకడు యిది పెన్నారు నదికి 3 మైళ్ల దూరంలో నున్నట్లు తన వ్రాతలలో పేర్కొన్నాడు. ఈ పట్టణం ప్రస్తుతపు స్థలానికి 10, 11 శతాబ్దాల మధ్య యెప్పుడో తరలించబడిందని భావించబడుతున్నది.

నెల్లూరు జిల్లా విస్తీర్ణం 7,960 చ. మై ఈ ప్రదేశం గుండా 10 నదులు, నదాలు, వాగులు ప్రవహిస్తున్నాయి. వాటిలో ముఖ్యమైనది పెన్నా నది. దీనికి సంగం, నెల్లూరుల వద్ద ఆనకట్టలు నిర్మించబడ్డాయి. ఈ జిల్లాలో సాగు నీటి సౌకర్యాలు యెక్కువగా యీ నదివల్లనే లభిస్తాయి. నెల్లూరుకి చరిత్రాత్మకమైన ప్రాధాన్యం యెక్కువగా పెన్నా నది వల్లనే లభిస్తున్నది అది మైసూరు రాష్ట్రంలోని నంది దుర్గ కొండలలో పుట్టి ఆత్మకూరు తాలూకా సోమశిలలోని వెలిగొండలలో సుందరమైన కనుమ గుండా నెల్లూరు జిల్లాలో ప్రవేశిస్తుంది. ఇది యీ జిల్లాలో ఆత్మకూరు, కోవూరు, నెల్లూరు తాలూకాలలో 70 మైళ్ల పొడుగున ప్రవహిస్తుంది. ఇది నెల్లూరుకి 18 మైళ్ల దూరంలో గల వూటుకూరు వద్ద సముద్రంలో కలుస్తుంది.

మొదట పెన్నానది నెల్లూరు సమీపంలో రెండుగా చీలింది ఇది యిలా చీలినచోట సంగమేశ్వరస్వామి ఆలయం (శివాలయం) వుండేది. ఆ తరువాత కాలక్రమేణా దీని దక్షిణపు పాయ మేట వేసుకుని పోయి అంతరించింది ఆ దేవాలయం అశ్రద్ధ చేయబడింది.

1565 లో విజయనగర సామ్రాజ్యం తెరమరుగుకి పోయింది. తళ్లికోటయుద్ధంతో ఒక మహాసామ్రాజ్యం అంతరించింది. చిరకాలస్థాపితాలైన అనేక వస్తువులు యెగిరిపోయాయి కాని విశ్వాసంమాత్రం సడలలేదు ఆ అఘాతంనుంచి తెరుకొనడం జరిగింది చరిత్ర యీ హంశానికి గుర్తుగా యిప్పటికీ ఒక అవశేషం వుంది. గత చరిత్ర యిచ్చిన ఆస్తిగా మానవుని అచంచల విశ్వాసానికి స్థిరసంకల్పానికి చిహ్నంగా నిలిచిన యీ అవశేషం నెల్లూరు రంగనాథస్వామి ఆలయంలోనున్న మహావిష్ణువు విగ్రహమే

తళ్ళికోటయుద్ధం ముగిసినవిమ్మట ఉదయగిరిలో ఒక దేవాలయంలోగల రంగనాథస్వామి విగ్రహం

పెరికివేయబడింది యుద్ధంలో జయించింది దానిని పెరికివేసిన మహమ్మదీయులు దానిని యేమీ పాడు చేయకుండా సుభ్రం ఒదలిపెట్టారు దానిని ఒక శ్రీవైష్ణవుడు చూసి అక్కడినుంచి నెల్లూరువరకూ మోసుకుని వెళ్ళాడు ఆ తరువాత దానిని సహ యించలేక నుంచి అవతల అంటువుకు తీసుకువెళ్ళలేక ఒడ్డున వదలిపెట్టాడు ఆ తరువాత కొంత కాలానికి అక్కడికి రంగనాయకుని శిష్యులు ... దానిని చూశారు వారు దానిని నది ఒడ్డుకు తీసుకుపోయి సంగమేశ్వరస్వామి ఆలయంలో, శివలింగాన్ని వుండ పెరికి యీ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు ఇప్పుడు రంగనాయకుల దేవాలయమని పలువబడే యీ దేవాలయం యొక్క పెద్ద గోపురమే సింహద్వారంగా కూడా వుపయోగిస్తున్నది. దీని కొంత యిటీవలనే కట్టబడింది. పెన్నపై నెల్లూరువద్ద ఆనకట్ట [illegible] సంవత్సరాల క్రితం నిర్మించబడింది. అది, 10,000 యెకరాలకి నీటిపారుదల లభింపచేస్తుంది. పైన సంగంవద్ద గల ఆనకట్ట జలాశయం పెన్నేరు వద్ద వున్నది. ఈ ఆనకట్టవల్ల మరొక లక్ష యెకరాలకి నీటి పారుదల లభిస్తుంది నెల్లూరులో ఒకప్పుడు 12-15 అడుగుల యెత్తుగల మట్టికోట, దాని చుట్టూ కందకమూ వుండేవట. దానికి రెండు ద్వారాలుండేవి. ఒక దానికి పడుగు పాడు ద్వారమని, రెండవ దానికి సర్వేపల్లి ద్వారమని పేరు. రెండవది పెద్ద చెక్కతలుపుతో చరిత్రాత్మకమైన చిహ్నంగా నేటికీ ఉన్నది. ఈ కోట లోపల శివాలయం ఒకటి విష్ణ్వాలయం ఒకటి వుండేవి. ఇవి ధ్వంసం చేయ బడినవి వాటి రాళ్లతో జమ్మా మసీదు నిర్మించ బడిందని ప్రతీతి. ఒకప్పుడు దేవాలయాలున్న స్థలంలో యెవరూ యిళ్లు కట్టుకొం సాహసించ నందువ ఆ స్థలాలు చాలకాలం ఖాళీగా వుండిపోయాయి. ఆ తరువాత ప్రభుత్వం యీ స్థలాలను స్వాధీనం చేసుకుని అక్కడ క్లబ్ డిప్యూటీ కలక్టరు, కలక్టరుల కార్యాలయాలను నిర్మించింది నెల్లూరులో నాలుగు శతాబ్దాలలో చాలా మార్పులు జరిగాయి పట్టణంబాగా విస్తరించింది ఆధునిక పట్నంగా తయారైంది 1951 జనాభా లెక్కల ప్రకారం దాని జనసంఖ్య రమారమి లక్ష వుంది దీనికి గడచిన కాలంతో గల మరొక బాంధవ్యం తల్పగిరి రంగనాథ దేవాలయం. కవిత్రయంలో ఒకడైన తిక్కన మహాభారతాన్ని యిక్కడే వ్రాశాడట ఒకప్పుడు యీ దేవాలయం వున్న స్థలంలో యిప్పుడు మునిసిపలు నీటి సరఫరా పనులు వున్నాయి.

## భూమి వుపయోగం

నెల్లూరు మన రాష్ట్రంలో జిల్లాల్లో మిక్కిలి దక్షిణాన వుంది విస్తీర్ణం 7,960 చ మై. జనసంఖ్య సుమారు 17 లక్షలు ఇక్కడ సర్కారు జిల్లాలవలె సారవంతమైన భూములు, కొండ ప్రాంతాలైన రాయలసీమలో వలె మెట్ట భూములు కూడా వున్నాయి దాని 13 తాలూకాలలోను 2 మాత్రమే డెల్టాలు ఇవి పెన్నానది స్కీం క్రింద వున్నాయి మిగిలిన అన్ని తాలూకాలలోను రాతిమయమైన మైదానాలు వున్నాయి. ఇక్కడ మెట్ట వ్యవసాయమే చేయబడుతుంది. ఈ పొలాలు ముఖ్యంగా వర్షాధారమైన చెరువులు, బావులు క్రింద వున్నాయి మొత్తం 50,87,200 యెకరాలలోను మూడో వంతులో మాత్రమే పంటలు వేయబడతాయి. జిల్లా విస్తీర్ణంలో మరొక మూడవవంతు బీడు భూములు' సాగులాయకు కాని భూములు అయి వున్నాయి' సాగులాయకైన బంజరు భూములు మొత్తం ప్రదేశంలో 100 కి 18 వంతులు వున్నాయి.

ఈ జిల్లా మొత్తం జనాభా 17.96 లక్షలు. ఇక్కడ 1561 గ్రామాలు, 12 పట్టణాలు వున్నాయి. ఎక్కువ భాగం ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. ఈ జిల్లా కర్ణాటక మైదానాలలో ఒక భాగమై వున్నది. సముద్ర తీరంనుంచి ప్రారంభమై భూమి క్రమేణా యెత్తవుతూ వెలిగొండ కొండలుగా మారుతుంది సముద్ర తీరం సుదీర్ఘమైన యిసుక ప్రదేశం దానిలో అక్కడక్కడ సర్వీ తోటలు, కొబ్బరి, తాటి తోపులు వుంటాయి కందుకూరు, కావలి, కోవూరు నెల్లూరు, గూడూరు, సూళ్లూరుపేట కోస్తా తాలూకాలు వుత్తరం నుంచి దక్షిణానికి వున్నాయి. వీటిపక్కన పశ్చిమానదర్శి,

పొదిలి, కనిగిరి, ఉదయగిరి, అత్మకూరు, రాపూరు, వెంకటగిరి తాలూకాలు మళ్లీ వుత్తరము నుంచి దక్షిణానికే వున్నాయి. శ్రీహరికోట ద్వీపం పొడవు 35 మైళ్లు, వెడల్పు 6 మైళ్లు. ఇసుక మయమైన యీ పల్లపు ప్రదేశం జిల్లా ఆగ్నేయ మూల వున్నది. ఇక్కడ తుప్పలు, సర్వీతోటలు వుంటాయి.

కోస్తా నానుకుని వున్న జిల్లా పూర్వార్థం సారవంతమైనదే. ఇక్కడ విస్తార ప్రదేశాలు సాగు చేయబడతాయి, చక్కని తోపులు వున్నాయి. పశ్చిమార్థంలో విస్తారమైన చిట్టడవులు, కొండగుట్టలు, రాతిమైదానాలు వున్నాయి. వీటిలో మిక్కిలి ప్రసిద్ధమైనది పులికోట సరస్సు.

తూర్పు కనుమలలో ఒక భాగమైన వెలిగొండలు జిల్లా పడమటి సరిహద్దు వెంబడే వెంకటగిరి తాలూకా నైఋతి మూలనుంచి కనిగిరి తాలూకా వుత్తరం వైపుకు వ్యాపించాయి. వీటిలో మిక్కిలి యెత్తైన శిఖరం సుమారు 3000 అ. యెత్తు వుంటుంది. ఉదయగిరి తాలూకాలోని వుదయగిరి దుర్గం 3079 అడుగుల యెత్తునవున్న పిడికొండ జిల్లా వివిధ ప్రాంతాలలో ముఖ్యంగా పొదిలి, కనిగిరి, దర్శి, కందుకూరు, తాలూకాలలో కూడా పిడికొండలు, కొండగుట్టలు వున్నాయి.

ఈ జిల్లా ప్రధాన నదులు యివి :

1. పెన్నారు
2. కండ్లేరు
3. స్వర్ణముఖి
4. మూసి
5. పాలేరు
6. మన్నేరు.

## చిన్ననదులు

1. గుండ్లకమ్మ
2. కేతమన్నేరు
3. కొల్లేరు
4. వెంకటగిరిఏటి
5. బొగ్గేరు
6. వైరపేరు.

నెల్లూరు జిల్లాలో వర్షాలు నిలకడగా కురవవు. ఏటా మొత్తం 35 అం.వర్షం కురుస్తుంది. ఇక్కడ నైఋతి ఋతుపవనాలు జూనులో ఆరంభ మవుతాయి. వాటివల్ల యిరవై రోజులుకురుస్తాయి వర్షాలు. అక్టోబరులో అరంభమయ్యే ఈశాన్య ఋతుపవనాల వల్ల 14 రోజులు కురుస్తాయి,

ఈ జిల్లాలో భూములు నల్లరేగడ, ఎర్రమట్టి, యిసుక నేలలు. ప్రభుత్వం పంట కాలువలు 19, బావులు 802, 7969 ప్రైవేటు బావులు, 447 చెరువులు మొత్తం 6.5 లక్షల యెకరాలకు నీటిని అందిస్తున్నాయి.

ఈ జిల్లా ప్రధాన ఆహారపంట వరి. ఇది ముఖ్యంగా పెన్నారు డెల్టాలో పండుతుంది. ఈ బియ్యంమంచి నాణ్యమైనవి, భారత దేశమంతటా అవి ప్రశంసించ బడుతవి. ఈ కారణంగా నెల్లూరు ప్రసిద్ధి కెక్కింది జొన్న, కుంబు, రాగి, కొర్ర, వరగు కూడా పండంచబడతాయి సామలు, మొక్కజొన్నలు కూడా పరిమిత ప్రదేశంలో పండించ బడతాయి. నువ్వులు, పొగాకు ప్రధాన వాణిజ్య పంటలు.

## పరిశ్రమలు

ఈ జిల్లాలో అభ్రకం పరిశ్రమ ప్రధానమైనది. అది ముఖ్యంగా గూడూరు, రాపూరు తాలూకాలలో కేంద్రీకృతమై వుంది 85 అభ్రకం సంస్థలు వున్నాయి. ఆ తరువాత బియ్యంమిల్లుల పరిశ్రమ వస్తుంది. గూడూరులో ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీ గాజుపలకల ఫ్యాక్టరీ వున్నాయి. ఈ రెండిటికికూడా చేతి శిక్షణాకేంద్రాలు వున్నాయి. నెల్లూరులో ఒక ప్రైవేటు పింగాణీ ఫ్యాక్టరీ వుంది. కోస్తాతాలూకాలలో ఫ్యాక్టరీలలో ఉప్పుకూడా యెక్కువగా తయారు చేయబడుతుంది.

ఈ జిల్లా ముఖ్యంగా వెంకటగిరి చేనేత బట్టలకు ప్రసిద్ధి. అభ్రకం, బియ్యంమిల్లుల పరిశ్రమ తరువాత బీడీల తయారీ పరిశ్రమ.

పొదిలి తాలూకాలో పలకగనులు వున్నాయి. ఇవి మొత్తం భారతదేశానికే కాక రంగూన్, సింహళాలవంటి సమీప విదేశాలకుకూడా పలకలను సరఫరా చేస్తాయి. కనిగిరిలో కట్టడపురాళ్లు, రోడ్డు రోలరు, తిరుగళ్ల తయారీలకి అవసరమైన రాళ్ళు పుష్కలంగా వున్నాయి కందుకూరు తాలూకాలో క్యానైటు దొరుకుతుంది సూళ్లూరుపేట తాలూకా పెనుబాక కొండగుట్టమీద ముడియినుప పుష్కలంగా దొరుకుతుందట ఈ జిల్లా రోడ్లగుండా మద్రాసు, చిత్తూరుజిల్లా చంద్రగిరి, కడపజిల్లా బద్వేలు, కర్నూలుజిల్లా కంభం, గుంటూరుజిల్లా వంగోలులకు వెళ్ళవచ్చు. 136 మైళ్ళ జాతీయ రహదార్లు, 102 మై. రాష్ట్ర రహదారులు, 671 మై. జిల్లా పెద్దరోడ్లు, 387 మై. జిల్లా యితరరోడ్లు, 346 మై. గ్రామరస్తాలు 5 మై. పి.డబ్ల్యు.డి. రోడ్లు, 44 మై. మునిసిపలురోడ్లు మొత్తం 1650 మైళ్ల నిడివిగలరోడ్లు వున్నాయి.

64 సబ్-పోష్టాఫీసులు, 620 బ్రాంచి పోస్టాఫీసులు, 27 తంతి కార్యాలయాలు, 13 పబ్లిక్ కాల్ టెలిఫోను ఆఫీసులు, నెల్లూరులో ప్రధాన తపాల కార్యాలయము వున్నాయి.

దక్షిణరైల్వే ఈశాన్య బ్రాడ్ గేజ్ మార్గం యీ జిల్లా పొడుగునా సముద్రతీరానికి సమాంతరంగా వుంది. మచిలీపట్నం-మర్మగోవామార్గం యీ జిల్లా వుత్తరకొసను తగులుతుంది గూడూరునుంచి బయలుదేరే యీశాన్య మార్గాన్ని చిత్తూరుజిల్లా రేణిగుంట లోని మైలుతిమార్గంతో కలిపే మీటర్ గేజ్ మార్గం యిటీవల బ్రాడ్ గేజ్ మార్గంగా మార్చబడింది,

బకింగ్ హాం కాలువ జిల్లా పొడుగునా సముద్రతీరానికి సమానాంతరంగా ప్రవహిస్తున్నది అందులో పడవలు నడుస్తాయి. దాని ద్వారా ప్రధానంగా వంట చెరకు సున్నపుగుల్లలు వంపబడతాయి

నెల్లూరు, గూడూరులలో రక్షిత నీటి సరఫరా పద్ధతి వున్నది ఈ జిల్లాలో భూమిలో అడుగు నుంచి మురుగు నీరుపోయే సౌకర్యంలేదు నెల్లూరులో మామూలు మురుగు కాలువలు వున్నాయి

నెల్లూరు, గూడూరులలో రెండు మునిసిపాలిటీలు, 12 మొదటి తరగతి పంచాయతీలు, 620 రెండవ తరగతి పంచాయతీలు వున్నాయి.

నెల్లూరులో మొదటి తరగతి కళాశాల, కావలిలో రెండవతరగతి కళాశాల మొత్తం రెండు ఆర్ట్సు కాలేజీలున్నాయి. నెల్లూరులో ఉపాధ్యాయుల శిక్షణకై మొదటి ప్రణాళిక కాలంలో ఒక శిక్షణా కళాశాల ప్రారంభింపబడింది 5 శిక్షణా పాఠశాలలు వున్నాయి. వాటిలో 3 ప్రత్యేకం స్త్రీలవి. పల్లిపాడులో ఒక వృత్తి విద్యా శిక్షణా పాఠశాల వుంది. 55 సెకండరీ పాఠశాలలు వున్నాయి. వాటిలో 7 ప్రత్యేకం బాలికలవి. ఈ జిల్లాలో మొత్తం 1683 ప్రాథమిక పాఠశాలలు వున్నాయి.

నెల్లూరులోని క్షయ ఆస్పత్రితో సహా 8 ప్రభుత్వ ఆస్పత్రులు ఒక స్థా. ని. ఆస్పత్రి, 1 మునిసిపలు ఆస్పత్రి, ఒక ప్రసూతి ఆస్పత్రి, 14 స్థా. ని. ఔషధశాలలు, 4 సబ్సిడైజుడు ఔషధ శాలలు వున్నాయి. ఈ జిల్లాలో సమాజాభివృద్ధి కార్యక్రమం వేరుదన్ని బాగా విస్తరించింది. ఇది యీ జిల్లాలో 12 అభివృద్ధి కేంద్రాలద్వారా అమలుపరచ బడుతున్నది. దాని క్రింద జిల్లాలో మూడోవంతు ప్రదేశం వుంది, మూడోవంతు ప్రజలు లాభం పొందుతున్నారు ఈ జిల్లాలోని 12 అభివృద్ధి కేంద్రాలు యివి. వెంకటాచలం, పొదలకూరు, ఇందుకూరుపేట, తోటపల్లి-గూడూరు, ఉదయగిరి, నెల్లూరు, కురిచేడు, వెంకటగిరి, చేజెర్ల, గూడూరు, నాయుడుపేట, కొండెపి.

వీటిలో వెంకటాచలం 2వ. అంచె కేంద్రం. కొండెపి పీ-ఎక్స్టెన్షన్ కేంద్రం, మిగిలినవి మొదటి అంచె కేంద్రాలు.

ప్రభుత్వం ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పథకం క్రింద ఇందుకూరు పేట కేంద్రంలో 32 సభ్యులతో అడ్ హాక్ పంచాయతీ సమితి యేర్పాటు చేయబడింది ఈ సమితి యిప్పటికి మూడుసార్లు సమావేశమై వివిధ రంగాలలో చేయవలసిన పనిని నిర్ధరించింది.

కుటుంబానికొక ప్రణాళిక పథకాన్ని ప్రవేశ పెట్టుటకు పొదలకూరు కేంద్రంలోని చిత్తూరు గ్రామం యెన్నబడింది. ' ఇందుకు సంబంధించిన ప్రాథమిక చర్యలు పూర్తి అయినవి. ప్రతి కుటుంబానికి మధ్యకాలిక, స్వల్పకాలిక ప్రణాళికలు తయారు చేయబడుతున్నాయి. స్వల్పకాలిక పరపతి పథకం తోటపల్లి—గూడూరు కేంద్రంలో అమలుపరచ బడుతున్నది.

ఈ కేంద్రాలన్నిటిలోను ప్రజలు సమాజాభివృద్ధి కార్యక్రమం అమలులో నానాటికి ఎక్కువగా సహకరిస్తున్నారు. ఇక్కడ ప్రభుత్వం రూ. 21.56 లక్షలు ఖర్చుపెట్టగా ప్రజలు రొక్కం, వస్తు, శ్రమ రూపాలలో మొత్తం రూ. 11.5 లక్షలు యిచ్చారు. ఇది ప్రభుత్వ ఖర్చులో సగాన్ని మించింది. ప్రజలు యెప్పటి కప్పుడు తమపై నిలిపిన విశ్వాసానికి అర్హులని ఋజువు చేసుకున్నారు; యీ జిల్లాలో స్థానికాభివృద్ధి పనుల కార్యక్రమం విజయాన్ని యిందుకు సాక్ష్యంగా తీసుకోవచ్చు. ఈ కార్యక్రమం క్రింద తొలి ప్రణాళిక కాలంలో 176 పనులు చేపట్టబడి 158 పూర్తి చేయబడినవి. వాటికై ప్రజలు రూ. 3.63 లక్షలు యిచ్చారు. కేంద్ర ప్రభుత్వం రూ. 9.12 లక్షలు గ్రాంటులుగా యిచ్చింది స్థానిక సంస్థలు రూ 6.47 లక్షలను యిచ్చినవి.

అభివృద్ధి కార్యక్రమం అన్ని రంగాలలోను యీ జిల్లా అంగలలో పురోగ మిస్తున్నది. ద్వితీయ ప్రణాళిక ఆఖరు నాటికి అక్కడ అభివృద్ధి కేంద్రాల సంఖ్య రెట్టింపు కంటె యెక్కువ కాగలదు అక్కడ ఎక్కువ పాఠశాలలు ప్రారంభించ బడగలవు, పాత వాటిని అభివృద్ధి పరచి, విస్తరింప చేయడం జరుగుతుంది. ఈ సంవత్సరం 28 పథకాల ద్వారా అక్కడ ఆహారోత్పత్తి హెచ్చించ బడుతుంది. మేలిరకం పశువుల అభివృద్ధికి పశువుల ఆరోగ్యానికి యీ సంవత్సరం రూ. 9.58 లక్షలపైన ఖర్చుపెట్ట బడగలవు. ఈ సంవత్సరం యీ జిల్లాలో మత్స్య సంపద కూడా అభివృద్ధి పరచ బడుతుంది; అడవులు విస్తరింప చేయబడతాయి; మధ్యరకం నీటి పారుదల ప్రాజెక్టులు పూర్తి చేయబడతాయి; 8 గ్రామాలకి విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతుంది. చిన్నతరహా పరిశ్రమలు కొత్తవి ప్రారంభించ బడతాయి; రాక పోకల సౌకర్యాలు అభివృద్ధి పరచ బడతాయి.

## నెల్లూరు జిల్లా

1. విస్తీర్ణం 7960 చ. మై.
2. జనాభా 17.96 లక్షలు (15.92 గ్రామీణ, 2.04 పట్టణ).

### సరిహద్దులు

3. ఉత్తరం = గుంటూరుజిల్లా
   తూర్పు = బంగాళాఖాతం
   దక్షిణం — చిత్తూరు, చెంగల్పట్టు జిల్లాలు
   పడమర — కడప, కర్నూలు జిల్లాలు
4. భూమిరకాలు = నల్లరేగడ, మిశ్రమం, ఎరుపు, యిసుకనేలలు
5. శీతోష్ణస్థితి= మొత్తంమీద పొడి, ఆరోగ్యకరమైనది.
   సగటుమొత్తం వర్షపాతం 38.9 అ.
   వర్షపు రోజులు 39
   గరిష్ఠ ఉష్ణోగ్రత 116.00

6. నీటి పారుదల

| | |
|---|---|
| చిన్నరకం నీటిపారుదల వనరులు | 1,507 |
| వాటిక్రింద ఆయకట్టు | 84,953 యెకరాలు |
| భారీ నీటి పారుదల వనరులు | 309 |
| వాటిక్రింద ఆయకట్టు | 2,76,949 ,, |

## 7. మధ్యరకం నీటి పారుదల పథకాలు

1. ఉప్పు టేరునది దిగువ ఆనకట్ట పథకం
2. పాండువ గండి జలాశయం పథకం
3. నక్కల గండి జలాశయం పథకం
4. రాళ్లపాడు జలాశయం పథకం

## 8. చెరువులు

1. నెల్లూరు చెరువు
2. సర్వేపల్లి జలాశయం
3. కనిగిరి జలాశయం

## 10. రెవిన్యూ డివిజన్లు

1. కందుకూరు
2. కావలి
3. నెల్లూరు
4. గూడురు

## 11. తాలూకాలు

1. కందుకూరు
2. కనిగిరి
3. కావలి
4. కోవూరు
5. నెల్లూరు
6. గూడూరు
7. సూళ్లూరుపేట
8. వెంకటగిరి
9. రాపూరు
10. ఆత్మకూరు
11. ఉదయగిరి
12. పొదిలి
13. దర్శి

## 12. పట్టణాలు, వాటిజన సంఖ్య

| | |
|---|---|
| నెల్లూరు (మునిసిపాలిటీ) | 81,480 |
| గూడూరు( ,, ) | 20,056 |
| వెంకటగిరి | 17,376 |
| కావలి | 15,516 |
| కోవూరు | 17,552 |
| కందుకూరు | 11,907 |
| అల్లూరు | 9,901 |
| సూళ్లూరుపేట | 8,573 |
| కనిగిరి | 8,321 |
| నాయుడుపేట | 7,486 |
| బుచ్చిరెడ్డి పాలెం | 7,076 |
| ఉదయగిరి | 4,395 |

13. భూమిశిస్తు దృష్ట్యా పెద్ద తాలూకా=కోవూరు
14. విస్తీర్ణం దృష్ట్యా పెద్ద తాలూకా =కనిగిరి
15. విస్తీర్ణం దృష్ట్యా చిన్న తాలూకా = కోవూరు
16. భూమిశిస్తు దృష్ట్యా పెద్ద గ్రామం = అల్లూరు
17. భూమిశిస్తు దృష్ట్యా చిన్న గ్రామం =చెరుకూరు పాడు (కందుకూరు తాలూకా)

### విద్యుచ్ఛక్తి

నెల్లూరు థర్మల్ కేంద్రం, కోవూరు రూ 59.71 లక్షల ప్రారంభ వ్యయంతో నిర్మించ బడింది. ఇప్పుడు నెల్లూరు జిల్లాలో 48 గ్రామాలకి మచ్ఖండ్ జల విద్యుచ్ఛక్తి సిస్టం క్రింద విద్యుత్తు లభిస్తుంది. గూడూరు, నాయుడుపేట, రేణిగుంట సెక్షన్‌లలో 27 గ్రామాలకు తుంగభద్ర జలవిద్యుచ్ఛక్తి సిస్టంనుంచి లభిస్తుంది

దిగువ తాలూకా ముఖ్యపట్నాలకి విద్యుచ్ఛక్తి డీసెల్ సెట్లద్వారా లభిస్తున్నది

1. కనిగిరి
2. దర్శి
3. ఉదయగిరి
4. ఆత్మకూరు

-:0-0:-

# సమర్థులైన గ్రామనాయకులు

“ఈ వుద్యమాన్ని నడుపుటకు పైన సమర్థులైన వ్యక్తులు కావాలి. గ్రామస్థాయిలో యింకా సమర్థులు వుండాలి. మనం వేల సంఖ్యలో గ్రామనాయకులకు శిక్షణ యివ్వాలి. తమ పనిని ప్రారంభించి పూర్తి చేయుట వీరికి గర్వకారణం కాగలదు” అని రాష్ట్రాల అభివృద్ధి కమిషనర్ల సమావేశంలో ప్రసంగిస్తూ మన ప్రధాని అన్నారు.

ప్రధానమంత్రి మాటలను అమలుపరుచుటకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్మాణాత్మకమైన కృషిచేసే నాయకులద్వారా గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుటకై “గ్రామసహాయకుల శిక్షణాశిబిరాల” పథకాన్ని తయారుచేసింది. ఇప్పుడు అమలుజరుగుతున్న యీ పథకం మొత్తంమీద వ్యవసాయవర్గం విషయాలలోను, ప్రత్యేకించి సమాజాభివృద్ధి కార్యక్రమంక్రింద ఆహారోత్పత్తిలోను శిక్షణకు ప్రాధాన్యత యిస్తుంది. ఈ శిబిరాలు అన్ని జిల్లాల్లోను నడుపబడుతున్నాయి. గ్రామీణులు వెంటనే అవలంబింపగల శాస్త్రీయ పద్ధతులలో శిక్షణ యివ్వబడుతుంది. ఈ శిక్షణాకార్యక్రమంలో వ్యత్తమ పరికరాలు, రసాయన యెరువులు, పెంటయెరువు గుంటలు, పచ్చియెరువులు, కాంటూరుబండ్సు, నారుక్షేత్రాలు, కృత్రిమ పిండోత్పత్తి, మేలురకం పశువులపాకలు, చెరువులు, బావులు, కాలువల సక్రమ నిర్వహణ, వివిధ యితర విషయాలు చేరివుంటాయి. ఈ శిబిరాలు ఒక్కొక్కటి మూడేసిరోజులు నడవాలి. ప్రతి గ్రామసహాయకుని మండలంలోను 50 మంది శిక్షితులతో యేటా ఒక శిబిరం నడవాలి. సమర్థులైన రైతులను తయారుచేసి, వారిద్వారా ఆధునిక విధానాలను పల్లెలకు వ్యాపింపచేయుట యీ శిబిరాల ఆశయమైవున్నది. ఈ గ్రామసహాయకులు తమ విజ్ఞానాన్ని తమ అభివృద్ధికి గ్రామాభివృద్ధికి యెలా వుపయోగిస్తున్నారో తెలుసుకొనుటకై వారిని వారివారి ప్రాంతాలలో కలుసుకొనుటకు కూడా ఒక కార్యక్రమం తయారుచేయబడినది.

## ప్రజాసహకారం

“గ్రామ సహాయకుల శిక్షణాశిబిరాల”లో ప్రజలు బ్రహ్మాండంగా చేరుతున్నారని జిల్లాలనుంచి వచ్చిన జూలై నెల నివేదికలు తెలుపుతున్నాయి. 1958 జూలైలో రాష్ట్రంలో గ్రామసహాయకుల శిక్షణా శిబిరాలు 119 నడిచాయి. వీటిలో 5,896 మంది గ్రామ సహాయకులు శిక్షణపొందారు. వారిలో 147 మంది స్త్రీలు వీటికి అభివృద్ధి కేంద్ర నిధుల నుంచి రూ. 5,950 ఖర్చు చేయబడినవి. ప్రజలు యిచ్చినసొమ్ము అంతకు నాలుగురెట్లు వుంది. 19 శిబిరాలు ప్రత్యేకం ప్రజల విరాళాలతో నడుపబడినవి. కర్నూలుజిల్లా ఎర్రగొండపాలెం అభివృద్ధి కేంద్రం ప్రజలు రొఖ్ఖం, వస్తు, శ్రమరూపాలలో రూ. 2,000 యివ్వడం హర్షణీయం. రాష్ట్రంలో 2-10-'57 మొదలు 1958 జూలై మాసాంతానికి వ్యవసాయవర్గం విషయాలలో గ్రామసహాయకుల శిక్షణాకేంద్రాలు 1100 నడుపబడినవి. వీటిలో 52,390 మంది గ్రామసహాయకులు శిక్షణపొందారు. అచిరకాలంలోనే లక్షలసంఖ్యలో శిక్షితులు శిబిరాలను వెలువడి నూతన జీవితజ్యోతిని నవభారతం మారుమూల ప్రదేశాలకుకూడా కొనిపోతారని ఆశించవచ్చు.

(స్టేట్ మెంట్)

## నడిచిన శిబిరాల వివరాలు

| జిల్లా పేరు | 1958 జూలై లో నడిచిన శిబిరాలు | ప్రత్యేకం ప్రజల సొమ్ముతో నడిచిన శిబిరాలు |
|---|---|---|
| శ్రీకాకుళం | 6 | 1 |
| విశాఖపట్నం | 12 | 2 |
| తూర్పుగోదావరి | 8 | 2 |
| పశ్చిమగోదావరి | 1 | - |
| కృష్ణా | 6 | 1 |
| గుంటూరు | 9 | 3 |
| నెల్లూరు | 11 | - |
| చిత్తూరు | 10 | - |
| కడప | 14 | 3 |
| అనంతపురం | 14 | 5 |
| కర్నూలు | 9 | 2 |
| మహబూబునగరం | 3 | - |
| హైదరాబాదు | 1 | - |
| నల్గొండ | 4 | - |
| ఖమ్మం | 2 | - |
| వరంగల్లు | 2 | - |
| మెదక్ | 4 | - |
| నిజామాబాదు | - | - |
| కరీంనగరం | 2 | - |
| ఆదిలాబాదు | 1 | - |
| | 119 | 19 |

కేంద్ర సమాజాభివృద్ధిశాఖామంత్రి శ్రీ ఎస్ కె డే అన్నట్లు ఆధునిక పరిజ్ఞానం, శాస్త్రీయ దృక్పథంగల రాయబారులవలె 'ఈ శిబిరాలు సమస్యలు క్రింది నుంచి కేంద్రానికి వెళ్ళుటకు శాస్త్రీయమైన జవాబులు అదేమార్గంలో పయనించుటకు సరాసరి సంబంధాన్ని కల్పించగలవు'



అక్టోబరు 18 న మౌంటు అబూలో కేంద్ర పోలీసు శిక్షణా కళాశాలలో పెరేడ్‌లో ప్రధాన మంత్రి నెహ్రూ వందన స్వీకారం చేశారు ఈ సంవత్సరంలో వుత్తమోత్తమ శిక్షితుడు శ్రీ కె వి హెచ్ పద్మనాభన్, ఐ పి ఎస్, కి ఆయన ప్రధానమంత్రి ట్రోఫీని బహూకరించడం చిత్రంలో చూడవచ్చు శ్రీ పద్మనాభన్ ఆంధ్రప్రదేశ్ కి కేటాయించ బడ్డారు

# జిల్లాల వార్తలు

## ఆదిలాబాదు

ఆదిలాబాదు సమాజాభివృద్ధి కేంద్రపు గ్రామ పదవ ప్రత్యేక శిక్షణా శిబిరం 27-9-1958 న శా. స. డా. జోలానార్ చే ప్రారంభించ బడింది. ప్రజలు తమలో తమకు గల చిన్న చిన్న విభేదాలను విస్మరించి అభివృద్ధి పనుల అమలుకై ముందుకు రావాలని ఆయన చిన్న ప్రసంగంలో చెప్పారు. ప్రభుత్వం కల్పించిన సౌకర్యాలను బాగా వుపయోగించుకోమని ఆయన ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

"పరిశాళికకు సంబంధించినంతవరకూ భారత దేశంలో రాజకీయ పక్షాలకు అభిప్రాయ భేదాలు లేవు" అని జిల్లా ప్లానింగు కమిటీ సభ్యులు శ్రీ బాలకిషన్ అన్నారు. ప్రతి పనీ ప్రభుత్వమే చేస్తుందనే అభిప్రాయంలో ప్రజలు వున్నారని చెబుతూ, యీ వైఖరి అలా కొనసాగినట్లయితే యే ప్రభుత్వము కూడా పరిశాళికను విజయవంతంగా అమలుపరచ లేదన్నారు.

ఈ శిబిరం జరిగిన మూడు రోజులలోను రాబి, వుత్పత్తి ప్రాధాన్యం గురించి నొక్కిచెప్ప బడింది.

ఒక వ్యవసాయ ప్రదర్శన యేర్పాటు చేయ బడింది. అక్కడ వుత్తమ విత్తనాలు, రసాయన యెరువులు, పరికరాలు, చార్టులు వగైరా ప్రదర్శించ బడినవి.

సినిమా ప్రదర్శనలు, యితర సాంస్కృతిక కార్యక్రమాలు యేర్పాటు చేయబడినవి. శిక్షతులందరూ గ్రామంలో జరిగే అభివృద్ధి కార్యక్రమాలను చూచారు, పంచాయత్ ఘర్, యువజన క్లబ్బు, మహిళా మండలులను చూచారు.

ఆ మండలం గ్రామాలకి చెందిన యించు మించు 41 మంది గ్రామ నాయకులు శిబిరానికి హాజరయారు. శిక్షితులు కాక రమా రమి 800 మంది ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు.

## చిన్నూరు కేంద్రంలో

చిన్నూరు మొదటి అంచె కేంద్రం పెట్టి పల్లిలో 1958 సెప్టెంబరు 28 నుంచి 30 వరకూ ప్రత్యేక గ్రామ నాయకుల శిక్షణాశిబిరం (వ్యవసాయ వర్గం) నడిచింది. తొలి రోజున శిబిరం గ్రామ సర్పాంచి, పురోగామిరైతుఅయిన శ్రీనివాసరావుచే ప్రారంభింప బడింది. ఈ శిబిరానికి చుట్టుపట్ల గ్రామాల నుంచి యించు మించు 50 మంది గ్రామ నాయకులు వచ్చారు. ప్రారంభోపన్యాసం తరువాత కొందరు పురోగామి రైతులు ఆధునిక వ్యవసాయ విధానాలలో తమ తమ అనుభవాలను చెప్పారు. ఆధునిక వ్యవసాయ పరికరాలు, రసాయన యెరువులు వగైరాలతో ఒక ప్రదర్శన యేర్పాటు చేయబడింది. శ్రమదాన కార్యక్రమంగా గ్రామీణులు రోడ్డును శుభ్రపరచారు. మధ్యాహ్నం పశు పోషణ విస్తరణాధికారి పశువులకు సర్వ సాధారణంగా వచ్చే జబ్బులు, అవి రాకుండా తీసుకొనవలసిన ముందు జాగ్రత్తలను గురించి మాట్లాడారు.

రెండవ రోజున అభివృద్ధి కేంద్రం అధికారి సమాజాభివృద్ధి వుద్యమం గురించి మాట్లాడారు. వ్యవసాయ సహాయకుడు మనోహరియల్ వ్యవసాయం ముఖ్యంగా జపాను పద్ధతి వరి సాగును గురించి మాట్లాడారు. మధ్యాహ్నం రాబివుద్యమం ప్రారంభించ బడింది. ఆఖరి రోజున చిన్న రకం నీటి పారుదలపై ప్రసంగం యేర్పాటు చేయబడింది.

## అనంతపురం

ముదిగుబ్బ కేంద్రం మల్లేపల్లిలో సెప్టెంబరు 28, 30 తేదీల మధ్య జరిగిన గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం సందర్భంలో ఒక ప్రదర్శన యేర్పాటు చేయబడింది. ద్వితీయ ప్రణాళిక క్రింద కార్యకలాపాలను సూచించే చార్టులు, పటాలను, ఉత్తమ వ్యవసాయ పరికరాలను, చేతితో తయారుచేసిన వస్తువులు ప్రదర్శింప బడినవి.

## కంబదూరు కేంద్రంలో

కంబదూరు కేంద్రము లకలేడులో సెప్టెంబరు 27 నుంచి 29 వరకూ గ్రామ సహాయకుల శిబిరం నడుపబడింది. ఆధునిక వ్యవసాయ పరికరాలు, క్రిమిసంహార ఔషధములతో ఒక ప్రదర్శన యేర్పాటు చేయబడింది. పంచాయతీ ఉపాధ్యక్షురాలు శ్రీమతి రెడ్డి తిప్పమ్మ పాఠశాలా భవనం నిర్మాణానికై రూ. 2,50,0,00 విరాళం యిచ్చింది.

## సింగనమలలో

సెప్టెంబరు నెలలో కల్లుమడి, పప్పూరులలో జరిగిన శిక్షణా శిబిరాలలో 100 మంది గ్రామ సహాయకులకు ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పశుపోషణ పద్ధతులలో శిక్షణ యివ్వబడింది. సింగనమల, కొర్రపాడులలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పై ఫిల్ము ప్రదర్శనలు జరుపబడినవి.

## కుడైర్‌లో

కుడైర్‌లో అక్టోబరు రెండవ తేదీన గాంధీ జయంతి జరుపబడింది. ఇందులో గ్రామాలన్ని ఉత్సాహంతో పాల్గొన్నాయి. వయోజన పాఠశాలకి తప్పకవచ్చే ఒక హరిజన స్త్రీకి, ఒక హరిజన బాలకునికి బహుమతులు యివ్వబడ్డాయి పంచాయతీ బోర్డు అధ్యక్షుడు, కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘం ఆర్గనైజరు, గ్రామస్థాయి కార్యకర్తలు వివిధ అభివృద్ధి కార్యకలాపాల ప్రాముఖ్యాన్ని వివరించారు.

## మడకశిరలో

సెప్టెంబరులో బుల్ల సముద్రం, కొడిగెన హల్లిల లో మొత్తం ఆరురోజులు గ్రామసాయకుల శిక్షణా శిబిరాలు జరిగాయి.

## కొడిగెన హల్లిలో

లేపాక్షిలో 6-9-58న జిల్లా వైద్యాధికారిచే ప్రాథమిక ఆరోగ్య కేంద్రము, జిల్లా ప్లానింగు ఆఫీసరుచే నీటి సరఫరా పనులు ప్రారంభింపబడినవి. వీటిలో ఒక్కొక్క దాని వ్యయం రూ. 20,000. ఈ సందర్భంలో ఒక బహిరంగ సభ జరిగింది. పంచాయతీ ఉపాధ్యక్షుడు శ్రీ ఎల్. వెంకటనారాయణప్ప ఆ సభకి అధ్యక్షత వహించారు.

## కడప

అనంతపురం, చిత్తూరు, నెల్లూరు జిల్లాలకు చెందిన అనుభవజ్ఞులైన 'కృషి పండితుల' జట్టు 1958 సెప్టెంబరులో కడప జిల్లాలో పర్యటించింది.

ఈ జట్టు చిన్న చౌకుకి వెళ్లి అక్కడ గ్రామస్థులు శ్రమదానంతో నిర్మించిన కమ్యూనిటీ హాలుని చూచి ప్రజల స్వచ్ఛంద సేవానిరతిని ప్రశంసించారు. బుద్ధయపల్లిలో ఒకవంతు ప్రభుత్వ ఖర్చు, మూడు వంతుల ప్రజల ఖర్చుతో నిర్మింపబడిన రోడ్లు, వంతెనలను కూడా చూచారు వారు. వ్యవసాయం, పశుపోషణ, సహకారం మున్నగు వాటికి సంబంధించిన వివిధ సమస్యలను గురించి వారు బుద్ధయపల్లి గ్రామస్థులతో చర్చించారు. వేరుసెనగ తుక్కును, పనుపు ఆకులను పెంటయెరువు తయారీలో వాడమని వారు గ్రామస్థులకి సలహా యిచ్చారు. తాము పెంట యెరువుల తయారీలో శిక్షణ పొందామని, పెద్ద యెత్తున దానిని తయారు చేస్తున్నామని అక్కడి గ్రామసహాయకులు వీరితో చెప్పారు. మత్స్య సంపద అభివృద్ధి పథకం క్రింద చిరుచేపలను నిలువచేసి జిల్లా అంతటికీ పంపిణీ చేసే చిరుచేపల పోషణ కేంద్రం కూడా వీరికి చూపించబడింది.

పూర్వ సి. పి. పథకం క్రింద అక్కయపల్లి గ్రామ శివారు నానికోటలో తెరువబడిన కుండలు ఫుత్పత్తి శిక్షణా కేంద్రానికి వెళ్లారువారు. కార్మికులతో మాట్లాడి ఆధునిక సారెలు దేశవాళి సారెకంటె బాగా యెలా పని చేస్తున్నవో తెలుసుకుని, కుంజాలు, యితర మట్టి సరుకులు మున్నగు వాటి తయారీ వివిధ దశలను చూశారు. వారు జిల్లా కోళ్ల పెంపక కేంద్రానికి వెళ్లారు. పశువైద్య సహాయ శస్త్ర చికిత్సకుడు వారికి కేంద్రాన్నంతనీ చూపించారు. ఆ కేంద్రంలో వివిధ మేలిరకం జాతులను వారు చూశారు. కిరసనాయిలుతోను, విద్యుచ్ఛక్తితోను కూడా పనిచేసే వివిధ రకాల గ్రుడ్లు పొదుగు యంత్రాలను కూడా వారు పరిశీలించారు.

కోళ్ల పెంపక కేంద్రానికి సమీపంలో 75 యెకరాల స్థలంలో కొత్తగా ప్రారంభింపబడిన ప్రభుత్వ అభివృద్ధికేంద్ర విత్తనాల క్షేత్రాన్ని యీ జట్టు వారు చూశారు. అక్కడ జరిగే భూమి బాగును చూశారు. వారు వెళ్లేసరికి క్షేత్రం పెట్టి ప్రాంతంలో జొన్న విత్తనాలు చల్లబడుతున్నాయి.

ఆ తరువాత వారు రామరాజుపల్లి వెళ్లి అక్కడ రైతులు కళాశాలా విద్యార్థుల సహాయంతో యెక్కువ పెద్ద పొలాలలో జపాను పద్ధతి క్రింద వరిపంటను పెంచుటను చూశారు. ఇది యీ కేంద్రంలో గమనార్హమైన పనులలో ఒకటి. ఈ పనిని యీ జట్టువారు చాలా మెచ్చుకున్నారు.

ఆ తరువాత వారు చెమ్మనూరుకి తీసుకొని వెళ్లబడ్డారు. అక్కడ వారికి కమ్యూనిటీ హాలు, పిల్లల పార్కు, గ్రంథాలయం, అభివృద్ధి కేంద్ర సమాచార కేంద్రం, పంచాయతీ పార్కు చూపబడినవి.

## తూర్పు గోదావరి

కేంద్రప్రభుత్వ - సమాజాభివృద్ధి మంత్రిత్వశాఖ సలహాదారు (నీటి పారుదల) శ్రీ బి. పి. మిట్టల్, వుప సలహాదారు (వ్యవసాయం) శ్రీ అయివినార్ 9-10-1958న సామర్లకోటను దర్శించారు. వారు విస్తరణ శిక్షణా కేంద్రం క్షేత్రాన్ని, పురావస్తు ప్రదర్శన శాలని, హోం సైన్సువింగుని చూశారు. 10-10-1958న వారిద్దరు సామర్లకోటలో వ్యవసాయ పరిశోధన కేంద్రాన్ని చూశారు. ఆ తరువాత వారు రామచంద్రపురం అంటె 2వ అభివృద్ధి కేంద్రంలోని చెల్లూరు గ్రామానికి వెళ్లి స్థానిక రైతులతో మాట్లాడారు.

వారు రామచంద్రపురంలోని తుల్యభాగలిఫ్టు ఇరిగేషన్ పథకాన్నికూడా చూసి ఆ పథకం డైరెక్టర్లు, సభ్యులతో సంభాషించారు.

## పంచాయతీ సమితి అధ్యక్షుల సమావేశం

ఆంధ్రప్రాంతం 11 జిల్లాల సమితికేంద్రాల అధ్యక్షులు, కొందరు సభ్యుల నిమిత్తం 22-9-58న ప్రారంభింపబడిన శిక్షణాశిబిరం 1-10-58న జిల్లా కలక్టరు ప్రసంగంతో ఆఖరయింది. ప్రస్తుత ప్రజాస్వామ్యంలో అధికార అనధికార బలాలు అధికోత్పత్తి ముఖ్యంగా అధికాహారోత్పత్తిద్వారా పేదరికాన్ని తొలగించి ప్రజల జీవన ప్రమాణాన్ని హెచ్చించాలని కలక్టరు తమ ప్రసంగంలో పేర్కొన్నారు. "ఇప్పుడు ఆధునిక విజ్ఞానశాస్త్రం అందించే పుష్కలమైన సమాచారాన్ని వినియోగించుకుని ఆహారోత్పత్తిని బాగా హెచ్చించుటకు సాయశక్తులా పాటుపడాలని మనం రైతులకు బాగా యెక్కువగా తెలియజేయాలి" అని ఆయన అన్నారు.

అంతకుముందు ఆయన తాము పొందిన శిక్షణపై తమకుగల అభిప్రాయాలను చెప్పమని కొందరు సభ్యులను కోరారు. చిత్తూరుజిల్లా కలికిరి పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ ఎన్.సి. రామిరెడ్డి, శ్రీకాకుళం జిల్లా....... సమితి అధ్యక్షుడు శ్రీ టి. సత్యనారాయణ శిక్షణా కార్యక్రమం యెక్కువ వుపయోగకరంగా వుండుటకు కొన్ని సూచనలు చేశారు.

విస్తరణ శిక్షణా కేంద్రం ప్రిన్సిపాలు శ్రీ డి. హనుమంతురావు వందన సమర్పణ చేశారు.

శిక్షణ యివ్వబడిన 10 రోజులలోను వివిధ జిల్లా వుద్యోగులు శిక్షితుల సమావేశంలో వివిధ విషయాలపై ప్రసంగించారు.

## కరీంనగరం

సుల్తానాబాదు అంచె I కేంద్రం గ్రామ సహాయకుల 5 వ శిక్షణాకేంద్రం 1958 సెప్టెంబరు 22 నుంచి 24 వరకూ నడుపబడింది. సహకార సంఘాలకు చెందినవారు ముగ్గురు, 42 మంది రైతులు, 8 మంది సంఘసేవకులకు మొత్తం 55 మందికి శిక్షణ యివ్వబడింది.

## కర్నూలు

కర్నూలులో 2-10-58 న ప్రారంభమైన మద్య నిషేధ వారోత్సవం 7 వ తేదీతో ఆఖరయింది. ఆఖరి రోజున బహిరంగసభ జరిగింది. ఈ వుత్సవానికి జిల్లా కలక్టరు అధ్యక్షత వహించారు. ప్రజలలో యెక్కువ భాగం మద్యనిషేధానికి సుముఖంగా వున్నారని సభలో మాట్లాడుతూ శా. స. శ్రీ అయ్యపరెడ్డి అన్నారు. చట్టం పూర్తి విజయానికి మరికొంత కాలం పడుతుందన్నారు. త్రాగుడు దుష్ఫలితాలను ప్రజలలో ప్రచారం చేయడం చట్టం అమలుకంటే చాలా ముఖ్యమైనదని అన్నారు.

ఎగువసభ సభ్యుడు శ్రీ ఎమ్. సుబ్బారెడ్డి త్రాగుడు దుష్ఫలితాలనుగురించి క్లుప్తంగా చెబుతూ మద్య నిషేధ చట్టాన్ని రద్దుపరస్తే దేశం ముందుకు సాగలేదన్నారు.

ఈ సందర్భంలో జిల్లా కలక్టరు, మరొక ఆరుగురు వ్యక్తులు మాట్లాడారు.

ఆ తరువాత శ్రీమతి రామేశ్వరమ్మ ఈ వారంలో జరిపిన ఆటలు, వక్తృత్వపోటీలలో గెలిచిన వారికి సాంస్కృతిక కార్యక్రమాలలో వుత్తమంగా పాల్గొన్నవారికి బహుమతులను పంచి పెట్టారు.

ఈ 'వారం' పొడుగునా బహిరంగసభలు, పాటకాలు, బుర్రకథలు, ఫిల్ముప్రదర్శనలు, వస్తుప్రదర్శనలు యేర్పాటు చేయబడ్డాయి. ప్రతిరోజూ యీ వుత్సవాలలో ప్రజలు వేలసంఖ్యలో పాల్గొన్నారు.

## సంజమల (అంచె I కేంద్రం)

బ్లాకు ప్లానింగు, అభివృద్ధి కమిటీ 10-9-58 న మొట్టమొదటగా నంద్యాల జిల్లా సహాయ కలక్టరు శ్రీ వి. కె. ధార్, ఐ. ఏ. ఎస్ అధ్యక్షతన సమావేశమయింది. ఉప్పలపాడు వాస్తవ్యులు శ్రీ సి. చిన్నపురెడ్డి యీ కమిటీ వుపాధ్యక్షుడుగా ఎన్నికయినారు. వ్యవసాయం, కుటీరపరిశ్రమలు, ఆర్థిక విషయాలు, విద్య, సాంఘికవిద్యల వుపసంఘాలు కూడా ఎన్నిక అయాయి. కమిటీ అభివృద్ధికేంద్రం మొత్తం కార్యక్రమాన్ని ఆమోదించి, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని పెరు సోమశిల గ్రామంలో నెలకొల్పుటకు తీర్మానించింది.

## ఆకుమళ్లలో

ఆకుమళ్ల గ్రామంలో 14-9-58 నుంచి 16-9-58 వరకూ గ్రామ సహాయకుల 6వ. శిక్షణాశిబిరం నడుప బడింది. 20 మంది పంచాయతీ సభ్యులు, ఒక మహిళతోసహా 52 మందికి వ్యవసాయ వర్గ విషయాలలో శిక్షణ యివ్వబడింది. ఈ శిబిర నిర్వహణకై ప్రజలు రూ 325 రొఖ్ఖాన్ని యిచ్చారు.

ఆకుమళ్ల పంచాయతీ వుపాధ్యక్షుడు శ్రీ ఎస్. చిన్న పుల్లారెడ్డి జాతీయ పతాకాన్ని యెగురవేశారు. శ్రీ వై. నారాయణరెడ్డి శిబిరాన్ని ప్రారంభించారు. కడప మొక్కల రక్షణాధికారి శ్రీ ఎస్. రామాంజనేయులు నాయుడు శిక్షితుల సమావేశంలో మొక్కల రక్షణ విధానాలను గురించి మాట్లాడారు. కర్నూలు - కడప కాలవ ఆయకట్టు స్థిరీకరణ సహాయ ఇంజనీరు, నంద్యాల, శ్రీ బి. వెంకటరామిరెడ్డి ప్రస్తుతపు చిన్నరకం సీటి వనరులను వినియోగించి వ్యవసాయోత్పత్తిని అధికం చేయవలసిన అగత్యాన్ని గురించి నొక్కి చెప్పారు. శా. స. శ్రీ సి. వి. తిమ్మారెడ్డి, ఆళ్లగడ్డ, గ్రామాలలో అయిక మత్యాన్ని సాధించుటకు కృషి చేయమని శిక్షితులను వుద్బోధించారు. శా. స. శ్రీ వి. వి. సుబ్బారెడ్డి, కోయిల్‌కుంట్ల, అభివృద్ధి కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొనమని గ్రామ సహాయకులను వుద్బోధించారు. పీరుకాళ అభివృద్ధికేంద్రం అధికార్లు,

సాంఘిక విద్యా అర్గనైజర్లు, వ్యవసాయ, పశుపోషణ విస్తరణ అధికార్లు, వ్యవసాయ డిమానస్ట్రేటరు, శిబిరం జరిగిన మూడు రోజులలోను శిక్షితుల సమావేశాలలో ప్రసంగించారు. ఆపైన వ్యవసాయ, పశుపోషణలపై చర్చలను జరిపారు.

వ్యవసాయం, పశుపోషణ, పారిశుద్ధ్యాల ఆధునిక విధానాలు ప్రత్యక్షంగా చూపించబడినవి కూడా. ఒక వ్యవసాయ ప్రదర్శన యేర్పాటు చేయబడింది.

శ్రమదానం యేర్పాటు చేయబడింది. పంచాయతీఘర్ నిర్మాణానికి ఒక నేలమట్టం చేయబడింది.

సాంస్కృతిక కార్యకలాపాల క్రింద కుమారి ఇందిరాదేవి హరికథ చెప్పారు. మీర్జాపురం గ్రామస్థులు చెంచునాటకం ప్రదర్శించారు. లండన్ మిషన్ స్కూలు విద్యార్థులు, ఆకుమళ్లబోర్డు స్కూలు విద్యార్థులు జానపద నృత్య ప్రదర్శనలు యిచ్చారు.

రెండు గదుల పాఠశాలా భవనాన్ని నిర్మించుటకు, పశువుల ప్రథమ చికిత్సా కేంద్రాన్ని ప్రారంభించుటకు, గ్రామీణ నీటి సరఫరా పథకానికి కూడా డబ్బు యివ్వడానికి గ్రామస్థులు ముందుకు వచ్చారు.

27-9-58 నుంచి 29-9-58 వరకూ నందిపాడులో గ్రామ సహాయకుల 7వ. శిక్షణా శిబిరం నడుపబడింది. వ్యవసాయ వర్గ విషయాలలో 52 మందికి శిక్షణ యివ్వబడింది. శిబిర నిర్వహణకై ప్రజలు రూ 263 రొఖ్ఖంగాయిచ్చారు. నందిపాడు గ్రామంలో శ్రమదానంతో 1 ఫర్లాంగు కచ్చారోడ్డు నిర్మింప బడింది.

సంజమల కేంద్రంలో 1958 సెప్టెంబరులో మీర్జాపురంనుంచి కొలిమి గుండ్లకి 2 మైళ్ల 3 ఫర్లాంగుల నిడివిగల పక్కారోడ్డు, బేలంనుంచి సింగవరం వరకూ 1 మైలు, 4 ఫర్లాంగుల నిడివిగల మరొక పక్కారోడ్డు ప్రజల సహకారంతో నిర్మించ బడినవి. సంజమల గ్రామంలో 3 ఫర్లాంగుల పక్కారోడ్డు నిర్మించబడింది. ఈ నెలలో 80 మేలిరకం పిట్టలు, 111 గ్రుడ్లు పంపిణీ చేయబడినవి.

రాబీ వుద్యమం విషయంలో తీవ్ర ప్రచారం చేయబడింది. 34 మణుగుల మేలిరకం జొన్న విత్తనాలు పంచబడినవి. 244 వ్యవసాయ ప్రదర్శనలు జరుప బడినవి. 220 పళ్ల మొక్కలు నాటబడినవి.

అభివృద్ధి కేంద్రం అధ్వర్యాన కునుకుంట్ల, అబ్దుల్లాపురం, తోళ్ల మడుగులలో పంచాయతీ సభ్యుల యెన్నిక జరిగింది.

9 పాఠశాలలు వృత్తి విద్యా పాఠశాలలుగా మార్చబడినవి. సంజమలలో స్త్రీల కుట్టుపని కేంద్రం ప్రారంభింప బడింది. ఇందుకు స్త్రీలు అద్దెలేకుండా వసతిని యిచ్చారు.

## మహబూబు నగరం

ప్రభుత్వ వున్నత పాఠశాలను ప్రారంభించుటకై రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ. ఎన్. సంజీవరెడ్డి మహబూబు నగరం జిల్లా కల్వకుర్తి వెళ్లారు.

శా. స. జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు అయిన శ్రీ అచ్యుత రెడ్డి యీ సమావేశానికి అధ్యక్షత వహించారు. మునిసిపాలిటీ అధ్యక్షుడు కల్వకుర్తిలో పురోగామి అయిన రైతు అయిన శ్రీ అబ్దుల్ కాదర్ స్వాగత పత్రాన్ని సమర్పించారు. జిల్లా సంఘ సేవిక, శా. స. అయిన శ్రీమతి శాంతాబాయి ఆ సందర్భంలో మాట్లాడుతూ, అంత స్వల్ప వ్యవధిలో అక్కడికి రెండవసారి వచ్చినందుకు ముఖ్యమంత్రికి కృతజ్ఞత చెప్పారు. ఆ తాలూకాలో వున్నత పాఠశాలను నెలకొల్పుటకై స్త్రీలు స్వచ్ఛందనగా విరాళాలు యిచ్చారని ఆమె చెప్పారు.

ఆ తరువాత ముఖ్యమంత్రి మాట్లాడుతూ వున్నత పాఠశాల కలిగివుండుటయే తాలూకాకైనా అదృష్టమని అన్నారు. ఈ తాలూకాకు విద్యుచ్ఛక్తి

కూడా వుండుట సంతోషకరం అన్నారు. విద్యుచ్ఛక్తి విషయంలో తెలంగాణా వెనుకబడి వున్నందున కేవలం అక్కడ విద్యుచ్ఛక్తికై రూ. 70-80 లక్షలు ఖర్చు పెట్ట బడుతున్నాయని ఆయన చెప్పారు.

ఆయన యింకా యిలా అన్నారు: భారత దేశం కొన్ని పొరుగు దేశాలవలె కాక సమాజాభివృద్ధి, జాతీయ విస్తరణ, సేవా కార్యక్రమాల ద్వారా అభివృద్ధిని సాధిస్తున్నది. పూర్వం గ్రామాలను నష్ట పరచి నగరాలను అందంగా తయారు చేసి అభివృద్ధి పరచేవారు కాని యిప్పుడు గ్రామాల అభివృద్ధికై యెంతో శ్రద్ధ గైకొన బడుతున్నది.

గండిపడిన చెరువుల మరమ్మతు విషయంలో, ఆ విషయం యికముందు నుంచి జిల్లా కలక్టరికి అప్పగించ బడుతుందన్నారు.

సాధించిన దానితో సంతృప్తి పడక కష్టపడి పని చేయమని ఆయన ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ కాం. క. అధ్యక్షుడు శ్రీ పి. రంగారెడ్డి మాట్లాడుతూ సమృద్ధిలో పేదరికం యే సంఘానికైనా మంచిది కాదని, దానిని గట్టిగా యెదుర్కోవాలని అన్నారు. సర్వశ్రీ అచ్యుత రెడ్డి శా. స., డా. కె. నాగన్న, యాదవ సంఘానికి చెందిన శ్రీ ఎ. నరసింహులు, తాలూకా కాంగ్రెసుకు చెందిన శ్రీ దాసులు కూడా మాట్లాడారు.

ఆ తరువాత రాష్ట్ర ముఖ్య మంత్రి జిల్లా కలక్టరు, జిల్లా యితర అధికారులతో పి. డబ్ల్యు. డి. ఇనస్పెక్షన్ బంగళాలో చర్చలు జరిపారు.

ముఖ్య మంత్రి పాఠశాలకి ఒక మైలు దూరంలో ఖాదీ గ్రామోద్యోగ కేంద్రానికి శంకు స్థాపన కూడ చేశారు.

## నల్గొండ

హోంశాఖా మంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డి తిప్పర్తి (నక్రేకాల్ అంచె, కేంద్రం) లో గ్రామ యువజనుల క్లబ్బు సహకారంతో స్థానికాభివృద్ధి పనుల పథకం క్రింద నిర్మించబడిన గ్రామ కమ్యూనిటీ హాలులో పంచాయతీ ఘర్ ని 25-9-58 న ప్రారంభించారు. శ్రమదానంతో కమ్యూనిటీ హాలును నిర్మించినందుకు ఆ ప్రాంతంలోని యితర అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొన్నందుకు మంత్రి గ్రామస్థులను అభినందించారు.

కమ్యూనిటీ హాలును గ్రామంతో కలుపుతూ శ్రమదానంతోనే ఒక రోడ్డు నిర్మించబడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రం

నక్రేకాల్ అభివృద్ధి కేంద్రం (అంచె 1) అధికారి, విరాళం కమిటీ కృషి ఫలితంగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రం నిర్మాణానికై ప్రజల నుంచి పది రోజుల లోపల రూ. 10,000 సేకరించ బడ్డాయి. ఈ ఆరోగ్య కేంద్రాన్ని అభివృద్ధి కేంద్రం ముఖ్య కార్యాలయం గల నక్రేకాల్ గ్రామంలో నెలకొల్పాలని కూడా నిర్ణయించ బడింది. విరాళాలు యిచ్చిన వారిలో శ్రీ ఇంద్రసేన రెడ్డి, శ్రీగోడు వాస్తవ్యుడు శ్రీ రామచంద్రరావు, శ్రీ కె. రాములు ప్రముఖులు. వీరు వరుసగా రూ. 1,116, రూ. 1000, రూ 1000 విరాళ మిచ్చారు.

## భోనగిరి పంచాయతీ సమితి కేంద్రం

1958 అక్టోబరులో కేంద్ర సమాజాభివృద్ధి మంత్రిత్వ శాఖ సంయుక్త కార్యదర్శి శ్రీ ఎ. ఎస్. నాయక్, ఐ. సి. ఎస్., కేంద్ర ప్రభుత్వానికి చెందిన శ్రీ పి. నాయర్ (వ్యవసాయం), శ్రీ విఠల్ (నీటి పారుదల) లు రాష్ట్ర అధికారులతో కలిసి అభివృద్ధి కేంద్ర కార్యక్రమం క్రింద జరిగే కార్య కలాపాలను తనిఖీ చేయుటకును, గ్రామీణుల సమస్యలను గురించి తెలుసు కొనుటకును భోనగిరి పంచాయతీ సమితి బ్లాకుకి వెళ్లారు.

శ్రీ నాయక్ బీబీనగరం, రైగిర్ గ్రామాలలో వ్యవసాయం మున్నగు వాటికి సంబంధించిన కార్యకలాపాలను తనిఖీ చేశారు. వారితో వెళ్లిన రాష్ట్ర

వ్యవసాయ శాఖ జాయింటు డైరెక్టరు శ్రీ విశ్వనాథరెడ్డి వారికి వివిధ వరి, జొన్న, ఆముదం పొలాలను చూపించారు. వ్యవసాయోత్పత్తికై రైతులు, అవలంబిస్తున్న ఆధునిక విధానాలు కేంద్ర అధికారులకు చూపించ బడినవి. ఆ అధికారులు రాబీ వుద్యమాన్ని గురించి రైతులతో చర్చించారు.

రైగిరి, బీబీనగరాలలో గ్రామస్థులు స్వయం కృషితో నిర్మించిన అప్రోచ్ రోడ్లను వారు చూశారు. అభివృద్ధి కేంద్రం ప్రారంభింపబడిన పిమ్మట సహకార గ్రామీణ బ్యాంకి, పిల్లలపార్కు, గ్రంథాలయం మున్నగునవి నెలకొల్పబడినవనీ, రైగిరి గ్రామస్థులకు సహకార పరపతి సంఘానికి, ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి, యువజనుల క్లబ్బుకి, సంక్షేమ విస్తరణకేంద్రానికి వసతి కల్పించబడినదనీ తెలుసుకుని కేంద్ర అధికారులు సంతసించారు.

## జిల్లాస్థాయి గోష్ఠి

వివిధ అభివృద్ధి కార్యక్రమాలను ప్రజలు, ప్రభుత్వము కలిసి సమిష్టిగా అమలుపరచాలని ప్రతి ఒక్కరూ అనుకున్నట్లయితే పది సంవత్సరాలలో సాధ్యమయిన పనిని నాలుగు సంవత్సరాలలోనే పూర్తి చేయగలుగుతాం, అని 14-10-58 న నల్గొండలో జిల్లా స్థాయి రెండవ గోష్ఠిని ప్రారంభిస్తూ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి అన్నారు.

కలక్టరు (ప్లానింగు) కార్యాలయంలో 3 రోజులు జరిగిన యీ గోష్ఠికి ప్లానింగు, అభివృద్ధి శాఖా మంత్రి శ్రీ వి. బి. రాజు అధ్యక్షత వహించారు.

దేశంలో పర ప్రభుత్వంవున్న నాటి పరిస్థితులకు, నేటి పరిస్థితులకు గల తేడాను వివరిస్తూ, ప్రజలు యిప్పుడు మంచికైనా చెడ్డకైనా పూర్తి బాధ్యతను ప్రభుత్వం మీదకి నెట్టలేరని ముఖ్యమంత్రి అన్నారు; యిప్పుడు యే కార్యసాధనలోనైనా వచ్చే జయాపజయాలకు ప్రజలు, ప్రభుత్వము కూడా బాధ్యులేనని అన్నారు. అభివృద్ధి కార్యక్రమాల అమలు విషయంలో అట్టి సమష్టి బాధ్యత దృక్పథం తప్పక వుండాలి.

మిగిలిన ప్రపంచంలో ప్రజలు యెంతో అభివృద్ధిని సాధించి చంద్రలోక యాత్రగురించి ఆలోచిస్తూంటే మన దేశంలో పరిస్థితులు యింకా వెనుకబడే వున్నాయి. ప్రజలు ఆఖరికి సగిన తిండి, బట్ట, యితర సౌకర్యాలు లేక అలమటిస్తున్నారు. ఈ విషయాన్ని గురించి లోతుగా ఆలోచించి యితర దేశాల వలెనే మన దేశాన్ని కూడా శీఘ్రంగా అభివృద్ధి చేయుటకు ప్రయత్నించాలి. ప్రభుత్వం నాగార్జున సాగర్, వైద్య కళాశాలలు వగైరా నిర్మాణం వంటి పెద్ద పనులను చేస్తున్నది. గ్రామాలలో ప్రజలు తమకు అవసరమైన పాఠశాలలు, గ్రామ రస్తాలు వగైరా చిన్న పనులను చేసే బాధ్యతను స్వీకరించాలి. ఈ విధంగా వారు అన్ని విషయాలలోను శీఘ్రంగా పురోగమిస్తారు.

మన దేశం ప్రజాస్వామ్య పద్ధతులలో ముందుకు సాగుతున్నది. కాని మన చుట్టూ గల కొన్ని దేశాలలో ప్రజాస్వామ్యానికి తావు లేకుండా చేయుట, దాని స్థానంలో నిరంకుశ ప్రభుత్వాన్ని యేర్పరుచుట జరుగుతున్నది. ఈ పరిస్థితులలో సాయశక్తులా మనం మన ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించుకోవాలి. మన రాష్ట్రంలో యే పౌరుడైనా ముఖ్య మంత్రిని విమర్శించి ప్రభుత్వ వ్యవహారాలలో అతడి లోపాలను వ్రేలెట్టి చూపించవచ్చు. మన ప్రజాస్వామ్య స్వాతంత్ర్యానికి యిది దర్పణం వంటిది. ఇది చాలా అమూల్యమైన హక్కు. దానిని ప్రజలు చాలా జాగ్రత్తగా భద్రపరచు కోవాలి.

స్వాతంత్ర్యం వచ్చిన యీ స్వల్పకాలం లోను మనం సాధించిన అభివృద్ధి గమనార్హమైనదని ముఖ్య మంత్రి అన్నారు; యింతమాత్రం సాధించుటకు కూడా అమెరికా, రష్యాల వంటి దేశాలు యింకా యెక్కువ కాలం తీసుకున్నాయి. మన దేశంలో యీ ప్రజాస్వామం భద్రపరచబడి, ప్రజలు అయికమత్యంతో కృషి చేసినట్లయితే స్వల్ప వ్యవధిలోనే యింకా యెక్కువ పనిని సాధించవచ్చు.

ప్రజాస్వామ్యం భారతదేశంలో విఫలమయినట్లయితే ప్రపంచంలో అది మనుటకు అవకాశం

లేదని ప్లానింగు శాఖా మంత్రి తమ అధ్యక్షోపన్యాసంలో పేర్కొన్నారు. భారత దేశంలో ప్రజల యిష్టానికి విరుద్ధంగా యెవరూ పరిపాలించ లేరు. "ప్రజాస్వామ్యం నుంచి సోషలిజం" భారతీయుల గమ్యం. దేశంలో 5 సంవత్సరాల ముందు ప్రవేశ పెట్టబడిన సమాజాభివృద్ధి కార్యక్రమం ఆశయం యెక్కువ యిళ్లు, యెక్కువ బావులు, యెక్కువ సౌకర్యాలు వగైరా తక్షణావసరాల సాధన ఒక్కటే కాదు; ప్రజలలో సాంఘిక భావాన్ని, జాతి అయిక్యత, సమష్టిబాధ్యతా భావాలను కలిగించి బలపరుచుట కూడా దాని ఆశయమై వున్నది. అన్ని రాజకీయ పక్షాలు ఒకే వేదిక నుంచి ప్రజా సేవ చేయుటకు అది అవకాశం యిచ్చింది. వారు యెంతో విలువైన యీ వేదికను గట్టి పరుచుకోవాలి.

అధికారం క్రమేణా ప్రజలకు అప్పగించ బడాలని యిప్పుడు అందరు యేకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. ప్రజాస్వామ్య వికేంద్రీకరణ సూత్రాన్ని అంగీకరించి, అభివృద్ధి కేంద్రాలలో పంచాయతీ సమితులను యేర్పాటు చేయుటలో యిది ప్రతిఫలించింది. ఈ విధంగా స్థానిక సమస్యలను స్వయంగా పరిష్కరించుటకై ప్రజా ప్రతినిధులకు యెక్కువ అధికారం వస్తున్నది. ఈ విషయంలో వారిని సన్నద్ధులను చేయుటకై అధికారుల విషయంలో వలెనె అనధికారుల విషయంలో కూడా శిక్షణా కేంద్రాల యేర్పాటుకు చర్య గైకొనబడింది. పంచాయతీ సమితుల అధికారాలు, వాటికి యేర్పాటు చేయబడగల జిల్లా పరిషత్తులకు మధ్య వుండదగు పరస్పర సంబంధాల విషయంలో శాసన సభ వచ్చే సమావేశంలో కొత్త శాసనం ప్రవేశ పెట్టబడుతుందని మంత్రి చెప్పారు. ఈ పంచాయతీ సమితుల అమలులో బాగా శ్రద్ధ తీసుకుని, ఆ సందర్భంలో కనబడిన లోపాలను, అడ్డంకులను గురించి తెలియపరచమని ఆయన ప్రజలకు విజ్ఞప్తి చేశారు. అప్పుడు వాటిని గురించి అంతా చర్చించి తగిన నిర్ణయం తీసుకొనుటకు అవకాశం వుంటుందన్నారు.

తమ తమ జిల్లాల బాధ్యత తమదేనని ప్రతినిధులు గుర్తించు కోవాలని నొక్కి చెబుతూ, అధికార వికేంద్రీకరణ, అధికాహారోత్పత్తి వంటి తక్షణావసర కార్యక్రమాలు అనే రెండు ప్రధాన సమస్యలు వారి ముందున్నవని అన్నారు. ఆహారోత్పత్తిని అధికం చేయుటకు తీసుకోన వలసిన చర్యలను సాకల్యంగా చర్చించి ఆ ప్రకారం సూచనలు చేయాలని అన్నారు.

ప్రసంగాన్ని ముగిస్తూ గోష్ఠిని ప్రారంభించి నందుకు ఆయన ముఖ్య మంత్రికి కృతజ్ఞత తెలిపారు. తమ చర్చలు సఫలం కావాలని కోరారు.

ఆ తరువాత విద్యా మంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు మాట్లాడుతూ ప్రతినిధులు తమ కృషిలో కృత కృత్యులు కావాలని ఆశీర్వదించారు.

ఈ గోష్ఠి ఆరు వర్గాలుగా చీలి, అధికాహారోత్పత్తి, విద్య, ఆరోగ్యం, పారిశుద్ధ్యం కుటీర పరిశ్రమలు, రాకపోకల సౌకర్యాలు, స్థానికాభివృద్ధి పనులు వగైరా విషయాలను గురించి చర్చించాయి.

ఈ పని మీద నల్గొండ వెళ్లినప్పుడే ముఖ్యమంత్రి నల్గొండలోని నాగార్జున కళాశాలను ప్రభుత్వం తరఫున లాంఛనంగా స్వాధీనం చేసుకున్నారు. అప్పుడు విద్యా మంత్రి అక్కడ వున్నారు.

## నెల్లూరు

నెల్లూరు జిల్లా వుదయగిరి తాలూకాలోని రెండు చిన్న రకం నీటి పారుదల పథకాలను 21-9-58న రాష్ట్ర నీటి పారుదల మంత్రి శ్రీ జె. వి. నర్సింగ రావు ప్రారంభించారు. ఈ రెండు ప్రాజెక్టులు కంప సముద్రం, అప్ప సముద్రాలలో వరుసగా రూ. 3.05 లక్షలు, రూ. 1.8 లక్షల వ్యయంపై అమలుపరచ బడతాయి. వీటి క్రింద మొత్తం 785 యెకరాలకి నీటి పారుదల లభిస్తుంది.

రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాలను మిగిలిన ప్రాంతాలతో సమాన స్థాయికి తేవాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదనీ, అందు నిమిత్తం ప్రత్యేక పథకాలను అమలు పరచుట, అన్ని పథకాలలోను యీ ప్రాంతాలకు ముందుప్రాధాన్యత యిచ్చుటల ద్వారా కృషి చేయబడు తున్నదని. ఆ సందర్భంలో మాట్లాడుతూమంత్రి అన్నారు. సమాజమంతా ఒకటే అన్న దృష్టితో ఆలోచించమనీ, అవసరమయితే వ్యక్తిగతంగా కొంత త్యాగం చేసైనా వుమ్మడి ప్రయోజనం పనుల అమలులో సహకరించమనీ ఆయన ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన శా. స. శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి నెల్లూరుజిల్లా చాలభాగం తెలంగాణా వలెనే బాగా వెనకబడి వున్నదని అన్నారు. దీర్ఘ కాలానికి ఫలించే భారీ ప్రాజెక్టులకు కాక త్వరగా ఫలించే చిన్నరకం ప్రాజెక్టులకు ప్రాధాన్య మివ్వబడు తున్నందుకు ఆయన సంతసించారు.

నీటి పారుదల శాఖామంత్రి 22-8-58 న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో మాట్లాడుతూ రాళ్లపాడు ప్రాజెక్టు పని శీఘ్రంగా జరుగుతున్న దన్నారు. సరుకు ముఖ్యంగా ఉక్కు కొరతవల్లనే యింత వరకూ దీని పని ఆలస్య మయిందన్నారు. ఈ ప్రాజెక్టు ఆయకట్టు 1000 యెకరాలు అప్పుడే సాగులోనికి వచ్చినవనీ, వాటికి అక్టోబరు మూడవ వారంనాటికి నీటి సరఫరా చేయుటకు యేర్పాటు జరుగు తున్నదనీ చెప్పారు.

కాళంగి ప్రాజెక్టు మార్పబడి మళ్లీ పరిశోధించ బడుతున్న దన్నారు.

## గ్రామ సహాయకుల శిబిరం

తోటపల్లి గూడూరు కేంద్రం తోటపల్లిలో మూడు రోజులు జరిగిన గ్రామ సహాయకుల ప్రత్యేక శిక్షణా శిబిరం సెప్టెంబరు 14 న శా. స. శ్రీ వి. కోదండరామరెడ్డిచే ప్రారంభింప బడింది. శ్రీ రెడ్డి మాట్లాడుతూ అధికాహారోత్పత్తి ప్రాధాన్యతని, ఆ సందర్భంలో శిక్షణాశిబిరాలు వహించే ముఖ్య పాత్రను గురించి చెప్పారు. ఆహార ధాన్యాల విషయంలో ఆంధ్రప్రదేశ్ స్వయం పోషకం లేక మిగులు రాష్ట్రం కూడా అయినందున రైతులు సంతృప్తి పడి వూరుకోరాదు. వారు జాతీయ దృక్పథంతో ఆలోచించి మొత్తం భారతదేశం ఆహారంలో స్వయం సమృద్ధిని సాధించే వరకూ నిర్విరామంగ కృషి చేయాలి.

అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలు యెక్కువగా పాల్గొనాలని కూడా ఆయన విజ్ఞప్తి చేశారు.

వ్యవసాయం, తత్సంబంధమైన విషయాలలో ప్రదర్శనలు, సిద్ధాంత రీత్యా బోధనలు కూడా యేర్పాటు చేయబడినవి, శిక్షితుల నిమిత్తం రోజూ రాత్రిళ్లు సాంస్కృతిక కార్యక్రమాలు జరిగేవి. గ్రామీణ జీవితం వివిధ అంశాలలో 50 మందికి శిక్షణ యివ్వబడింది.

## హరిజన్ డే

ఆగస్టు 30 వ. తేదీని యెలమంచిలి దిన్నె ఇసుకపాలెంలో హరిజన్ డే జరుప బడింది. ఆ సందర్భంలో వీధులు, నూతులు బాగుచేయ బడ్డాయి. మురుగు నీరు గుంటలు త్రవ్వబడినవి. బహిరంగ సభ జరుప బడింది; అక్కడ ఆరోజు ప్రాముఖ్యం వివరించ బడింది. గ్రామంలో మిక్కిలి శుచి శుభ్రతనుగల యింటికి, మిక్కిలి ఆరోగ్యకరమైన శిశువుకి బహుమతులు యివ్వబడినవి.

ఇందుకూరుపేట అంచె 1 కేంద్రంలో 1958 ఆగస్టులో 1046 సాంస్కృతిక, యితర ప్రదర్శనలు జరుపబడినవి. 340 యెకరాలు జపాను పద్ధతి వరి సాగు క్రిందికి తేబడినవి. 2358 పళ్ల చెట్లు, 20,801 యితర చెట్లు నాటబడినవి. 1010 ఇంటి తోటలు వేయబడినవి. 34 పౌనుల కూరగాయల విత్తనాలు పంపిణీ చేయబడినవి. 40½ యెకరాలలో కూరగాయలు వేయబడినవి.

## శ్రీకాకుళం

సీతంపేట అంచె 1 కేంద్రంలోని సంఘంలో 28-9-58 నుంచి 30-9-58 వరకూ ప్రత్యేక గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం యేర్పాటుచేయబడింది. 11 గ్రామాలకు చెందిన 53 మందికి శిక్షణ యివ్వబడింది. వారిలో 45 మంది పురుషులు, 8 మంది స్త్రీలు. శిక్షితులందరూ గిరిజనులే. సంఘంలో ప్రముఖ రైతులందరూ ఒక సంఘంగా పర్పడి శిబిరానికి ఆహారం యేర్పాట్లు, వసతి సౌకర్యాలు చేశారు.

మూడవ రోజున, అబూ సమావేశం నిర్ణయాలను అమలుపరచుటకు, రాబీ పుద్యమం క్రింద రెండవ పంట వరి వుత్పత్తిని హెచ్చించుటకు వుత్తమ పద్ధతులను నిర్ణయించుటకై పురోగామి రైతులు, శిక్షితులైన గ్రామ సహాయకులు, శిక్షితులతో సమావేశం యేర్పాటు చేయబడింది. గ్రామీణుల అవసరాలను తీర్చుటకు సమూహాభివృద్ధి కార్యక్రమంలో అభివృద్ధి కేంద్రం సిబ్బందికి తోడ్పడుటకు గ్రామ సంఘాలను యేర్పరచాలని ఆ సమావేశంలో తీర్మానించ బడింది. రెండవ పంట వరికి స్వచ్ఛమైన విత్తనాలు, యెరువులు సరఫరా చేయబడతాయనీ, గ్రామాలలో యెవరి కెన్ని విత్తనాలు, యెరువులు కావాలో తెలుసుకొని తద్వారా పురోగామి రైతులు, శిక్షితులైన సహాయకులు తోడ్పడాలని సూచించ బడింది.

శిబిర నిర్వహణ లాభ నష్టాలను లెక్క చూచుటకై ఆఖరున సిబ్బంది సమావేశం జరుప బడింది.

## విశాఖపట్నం

విశాఖపట్నం వుపాధ్యాయుల గిల్డు అధ్వర్యాన భీమునిపట్నంలో 1958 సెప్టెంబరు 27, 28 తేదీలలో వార్షిక జిల్లా విద్యా సంబంధ సమావేశం జరిగింది. ఈ సమావేశాన్ని విద్యా మంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు ప్రారంభించారు. ఈ సందర్భంలో విజయనగరం ఎమ్. ఆర్. కళాశాల, ఏలూరు సి. ఆర్. ఆర్. కళాశాలల ప్రిన్సిపాలులు ప్రసంగించారు. మునిసిపలు కౌన్సిలు అధ్యక్షుడు శ్రీ కె. సూర్యనారాయణ స్వాగత పత్రాన్ని యిచ్చారు. అధ్యక్షోపన్యాసాన్ని శ్రీ జె.వి. రామమూర్తి చదివారు.

ఉపాధ్యాయులు తమ కోర్కెలను అందరి ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని అడగాలనీ, అపమార్గులయిన వ్యక్తులను సమర్థించి వారు తమ ప్రయోజనాలకు భంగం కలిగించుకో రాదని విద్యా మంత్రి చిన్న ప్రసంగం చేస్తూ అన్నారు. తక్కువ జీతాల వుపాధ్యాయులకు తోడ్పడుటకు ప్రభుత్వం మిక్కిలి ఆతురతతో వుందన్నారు.

విద్యా ప్రమాణాలు తక్కువగా వుండుటకు గల కారణాలను పరిశీలించుటకు డా. ఎ. ఎల్. నారాయణ అధ్యక్షతన ఒక సంఘం యేర్పాటు చేయబడిందనీ, ఆ ప్రమాణాలను అభివృద్ధి పరచుటకు తగిన చర్యలు తీసుకొనబడతాయనీ ఆయన చెప్పారు. పాఠశాలల నిర్వహణాధికారులు వేర్వేరు అయినందున ప్రధానోపాధ్యాయుల జాతీయకరణ సాధ్యం కాదన్నారు. ప్రసంగాన్ని ముగిస్తూ జిల్లా విద్యాధికారులు పాఠశాలలకు హఠాత్తుగా వెళ్లి అక్కడ పరిస్థితులను తెలుసుకోవాలని ఆయన సూచించారు.

## నీటి పారుదల పథకాలు

విశాఖపట్నం జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ సమావేశం జిల్లా కలక్టరు అధ్యక్షతన అక్టోబరు 17 వ తేదీన జరిగింది. జిల్లా నీటి పారుదల సలహా సంఘం ఒక్కొక్క తాలూకాలో యించు మించు డజను పథకాలను పరిశీలించాలని సిఫార్సు చేసింది. ప్లానింగు కమటీ యీ సిఫార్సులను సమీక్షించి, బడ్జెటు కేటాయింపు యింకా యెక్కువ వుండాలని భావించింది. అధికాహారోత్పత్తిని సాధించుటకై జిల్లాలో ప్రత్యేకంగా పరిశోధన డివిజన్ వుండాలని వాంఛించింది.

జిల్లాలో చిన్న మొత్తాల పొదుపు వుద్యమం విషయంలో, లక్ష్యం రూ. 60 లక్షలలోను యింతవరకూ

నాలుగోవంతు సేకరించబడినదని జిల్లా కలక్టరు చెప్పారు. సంవత్సరాంతం లోగా లక్ష్యాన్ని సాధించుటకై కృషి చేయమని ఆయన అధికార, అనధికార సభ్యులను కోరారు.

## రాబీ వుత్పత్తి

ఆహారం అధికంగా వుత్పత్తి చేయబడాలని ఆయన నొక్కి చెప్పారు. రాబీ ఆహారోత్పత్తి వుద్యమం విజయానికై శ్రమపడి పని చేయమని ఆయన సభ్యులను కోరారు. రైతులకు వ్యక్తి హామీపై రూ. 25 నుంచి 50 వరకూ అప్పులు యివ్వబడతాయనీ, వారికి వుత్తమ విత్తనాలు కూడా అందజేయ బడతాయనీ చెప్పారు





విశాఖపట్నం నౌకాశ్రయం

# రేవుస్థలాల అభివృద్ధి

రాష్ట్రంలో రేవుల అభివృద్ధికై ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో దిగువ పథకాలు చేర్చబడినవి. ఈ పథకాలు ప్రణాళికకాలం సమాప్తినాటికి పూర్తి కాగలవని ఆశించబడుతున్నది

1 గుంటూరు జిల్లాలో ఓడరేవు రేవు పునః ప్రారంభం.

2 కుష్టేరు సక్షన్ డ్రెడ్జర్‌ని కాకినాడనుంచి మచిలీపట్నానికి బదిలీ.

3 కాకినాడ, మచిలీపట్నం రేవులను పోర్టుట్రస్టులుగా మార్చే విషయం పరిశీలన.

4 కృష్ణపట్నం రేవుకి టగ్ కొనుగోలు.

5 కాకినాడ, మచిలీపట్నాల డ్రెడ్జింగు తుదిని వేదిక హైడ్రోగ్రాఫిక్ సర్వే యూనిట్ల పదకంతో సహా పూర్తి చేయబడింది, కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయానికై నిరీక్షించబడుతున్నది.

6 కాకినాడ, మచిలీపట్నం రేవులలో రేడియో, టెలిఫోన్ సిస్టం యేర్పాటు విషయంలో పరికరాల సరఫరాకై నిరీక్షించబడుతున్నది.

7 కాకినాడలో కొత్త దిగుమతి వార్ఫ్ నిర్మాణం. ట్రాన్సిట్ షెడ్డులు, స్టేకింగు ప్లాటుఫారాల పనులను 1958-59 లో అమలుజరుపాలని సంకల్పించబడింది

8 కాకినాడరేవుకి కొత్త సంచార క్రేన్.

9 మచిలీపట్నానికి కొత్త డ్రెడ్జి డాకు, వర్కుషాపు సంకల్పించబడ్డాయి.

10 కాకినాడ రేవులో యెక్కువగా దిగే ముడియినుముకి కొత్త డాక్ ప్రదేశం సంపాదన, కాలువలలో జరిగే రవాణాలకి పెద్ద స్టేకింగు ప్రదేశాలు.

11 మచిలీపట్నం రేవులో కొత్త సిగ్నల్ స్తంభం యేర్పాటు.

12 కృష్ణపట్నం రేవులో సిగ్నల్ స్తంభం యేర్పాటు, సిగ్నలింగును ప్రవేశపెట్టుట.

కాకినాడ, మచిలీపట్నం రేవులనుంచి భారతదేశంలోని చిన్నరేవులన్నిటిలోకంటే యెక్కువ ముడియినుము యెగుమతిఅయింది. ముఖ్యంగా కాకినాడ రేవునుంచి ఒక స్టీమరులో 24 గంటల ఒక రోజులో 3962 టన్నుల ముడియినుము లోడ్ చేయబడింది. ఇది భారతదేశంలో యే చిన్నరేవు లేక మధ్యరకం రేవుకూడా చేయలేని పనని చెప్పవచ్చు:

ఆంధ్రప్రదేశ్ బోట్లు ముడియినుము లోడింగు విషయంలో చాలా సంతృప్తికరంగా పని చేస్తున్నాయి. అవి ఇండియా పశ్చిమతీరాన, ఒరిస్సా పరదీప్ రేవులోను కూడా పని చేస్తున్నాయి.

కాకినాడ పోర్టు విషయంలో గ్రోయాన్సు, రివెట్‌మెంట్ల పనులు పూర్తయాయి ; కొయ్యజెట్టీల మార్పువిషయంలో కెనాల్ బోట్ వార్ఫుల అభివృద్ధి; 5 వార్ఫులు పూర్తిఅయినవి; మరిరెండు అదనంగా నెలకొల్పబడుతున్నవి.

మచిలీపట్నంలో ఆంకరేజ్ పునఃపరిశీలన పూర్తి అయింది.

కృష్ణ పట్నంరేవు ఆంకరేజ్ సర్వేకూడా పూర్తి అయింది.

కళింగపట్నంలో స్టేకింగు ప్లాట్‌ఫారానికి, ఒక చిన్న షెడ్డుకు సంబంధించిన పని పూర్తి అయింది. సిగ్నల్ కేబిన్ ఒకటి నిర్మించబడింది.



# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న 75 : (శ్రీ రుద్రమరాజు వెంకటరాజు, దుంప గడప, పశ్చిమగోదావరి జిల్లా) ఆంధ్ర, తెలంగాణాలలో అమ్మకం పన్నులనుంచి యెంత సొమ్ము వసూలు చేయబడు తున్నది ?

జవాబు : 1957 ఆ. ప్ర. సా. అ. ప. చట్టంక్రింద 1957-58 ఆర్థిక సంవత్సరంలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో అమ్మకం పన్ను దిగువవిధంగా వసూలు చేయ బడింది.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రప్రాంతం : | బకాయిలు | రు. | 24,66,751 |
| | ప్రస్తుతానివి | రు. | 6,32,65,431 |
| తెలంగాణాప్రాంతం: | బకాయిలు | రు. | 14,88,302 |
| | ప్రస్తుతానివి | రు. | 2,14,64,717 |

ప్రశ్న 76 : (శ్రీ బి. శేషగిరిరావు, కొత్తగూడ గ్రామం, ఈబ్రహింపట్నం తాలూకా) ఆంధ్రప్రదేశ్ లో భారీ ప్రాజెక్టులు యెన్నివున్నాయి ? చిన్నరకం ప్రాజె క్టుల వివరాలుకూడా తెలువప్రార్థన.

జవాబు :

## తెలంగాణా ప్రాంతం

భారీప్రాజెక్టులు :

కడం.
రాజోలిబండ.
మూసీ.

మధ్యరకం ప్రాజెక్టులు :

కోయిల్ సాగర్.
సర్లాసాగర్.
భీమునిపల్లి.
సీరాల.
గండిపడిన చెరువులకు మరమ్మతులు నెం. 1499.

### కొత్తపథకాలు

మధ్యరకం :

జట్ పల్లి.
లఖ్నపూర్.
చిన్నమూసీ.
నక్కవాగు.
నల్లవాగు.
జౌలినాల.
రామ్మడుగు.
సుద్దవాగు.
సాల్వాగు.
లక్ష్మీసాగర్.
డేప్రపనివాగు.

చిన్నరకం :

కొత్తపట్నం వాగు.
పెదవాగు శాఖ (బోమేరా).
జంగల్ నాల.
పాతచేరు.
కట్టకచేర్వు.
పాలేరు.
గండిపడిన చెరువులకు మరమ్మతులు : నెం. 1247.

## ఆంధ్రప్రాంతం

### స్పిల్ ఓవర్ స్కీములు

మధ్యరకం :

శ్రీకాకుళం : తోటపల్లి రెగ్యులేటరునుంచి ప్రారంభమయే నాగావళి కుడికాలువ.

| | |
|---|---|
| శ్రీకాకుళం : | వేగావతి ఆనకట్ట పథకం. |
| శ్రీకాకుళం : | సీతానగరం ఆనకట్ట. |
| శ్రీకాకుళం : | నారాయణపురం ఆనకట్ట. |
| విశాఖపట్నం : | గంభీరంగెడ్డ జలాశయం పథకం. |
| పశ్చిమగోదావరి : | బందకట్టు కాలువ సిస్టం మార్పు. |
| నెల్లూరు : | నక్కలగండి జలాశయం పథకం. |
| నెల్లూరు : | పాండువాగు కనుమ సమీపంలో పాలేరు జలాశయం పథకం. |
| నెల్లూరు : | ఉప్పుటేరు దిగువ ఆనకట్ట పథకం. |
| అనంతపురం : | చెన్నరాజస్వామి గుడి ప్రాజెక్టు. |
| అనంతపురం : | విద్యారణ్యస్వామి చెరువు మరమ్మతు. |
| కర్నూలు-కడప కాలువ: | కర్నూలు - కడప కాలువ అభివృద్ధి. |
| కడప : | దిగువ సగిలేరు ప్రాజెక్టు. |
| కడప : | పించానది జలాశయం ప్రాజెక్టు. |
| చిత్తూరు : | కాళంగి జలాశయం పథకం. |
| చిత్తూరు : | నల్లమడుగు జలాశయం పథకం. |
| చిత్తూరు : | సిద్దలంగండి ప్రాజెక్టు. |

ప్రశ్న 77 : కీలక గ్రామ కేంద్రం అంటే యేమిటి? దాని ఆశయాలు యేమిటి ?

జవాబు :- కీలక గ్రామ కేంద్రం అంటే పశువుల తీవ్ర అభివృద్ధికై యెన్నబడిన పల్లె ప్రాంతం. ఒక కేంద్రంలో 6 కీలక గ్రామ యూనిట్లు వుంటాయి. ఒక్కొక్క యూనిట్టులో ఆంబోతులకి, పాల వుత్పత్తికి పనికి వచ్చే ఆవులు లేక గేదెలు యించుమించు 800 వుంటాయి.

పశువుల సర్వతోముఖాభివృద్ధి యీ పథకం ఆశయం. దీనిక్రింద మేలిరకం పశువులు అభివృద్ధి పరచబడతాయి. పశువులకు తగిన మేతకి, వ్యాధి నిరోధం, చికిత్సలకు, సరైన నిర్వహణకి, లాభకరమైన వస్తు విక్రయానికి వసతి కల్పించబడుతుంది. ఆశయం పాల వుత్పత్తి హెచ్చింపు.

ప్రశ్న 78 : (శ్రీ వి. డి. రమణ, శ్రీనివాసపురం) నాగార్జున సాగర్ యెడమ కాలువ యే పెద్ద చెరువుతో కలుపబడుతున్నది? గ్రామం, తాలూకా, జిల్లాలతో సహా వివరాలు తెలియచేయ ప్రార్థన.

జవాబు :- నాగార్జున సాగర్ యెడమ కాలువ, నల్గొండ జిల్లా మిర్యాలగూడ తాలూకా నందికొండ గ్రామం దిగువ ప్రవాహం 1-1/2 మైళ్ళ వద్ద కృష్ణా నదిపై నిర్మించబడే నాగార్జున సాగర్ జలాశయం యెడమ గట్టు ఫోర్ షోర్ నుంచి బయలుదేరుతుంది. ఈ కాలువ 84 వ మైలులో పాలేరు వద్ద గల జలాశయం గుండా వెళ్లుటకు యేర్పాటు చేయబడింది. ఇది 108 వ మైలులో మన్నేరును దాటుతుంది. ఇక్కడే యీ ప్రాజెక్టు రెండవ అంచెలో కొత్త జలాశయం నిర్మించబడాలని సంకల్పించబడింది.

1. ప్రస్తుతపు పాలేరు జలాశయం.

| | |
|---|---|
| గ్రామం | నైకన్‌గూడా |
| తాలూకా | ఖమ్మంమెట్టు |
| జిల్లా | ఖమ్మంమెట్టు |
| ఆయకట్టు | 17,000 యెకరాలు |
| స్టోరేజి | 2559 ఎమ్. సి. ఎఫ్. టి. |

2 మన్నేరు పై సంకల్పించబడిన జలాశయం.

| | |
|---|---|
| స్థలం | ఖమ్మానికి ఉత్తరాన 5 మైళ్లు |
| తాలూకా | ఖమ్మంమెట్టు |
| జిల్లా | ఖమ్మంమెట్టు |
| ఆయకట్టు | 50,000 యెకరాలు |
| స్టోరేజి | 1000 మిలియన్ ఘ. అ. |

మన్నేరు జలాశయం నిర్మాణం నాగార్జున సాగర్ ప్రాజెక్టు రెండవ అంచెలో చేపట్టబడుతుంది. యీ ప్రాజెక్టు మొదటి అంచె మాత్రమే మంజూరు చేయబడింది.

ప్రశ్న 79 : నాగార్జున సాగర్ కాలవ నల్గొండ జిల్లా గుండా యెప్పటికి ప్రవహిస్తుంది?

జవాబు :- నాగార్జున సాగర్ యెడమ కాలువలో నీరు 1964-65 నుంచి ప్రవహిస్తుందని భావించబడుతున్నది.



# అభిప్రాయ వేదిక

## "సర్వ సమర్థులు"

ఇటీవల ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ ప్రకటించిన సావెనీర్ కి సందేశం పంపుతూ భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ యు. ఎన్. ఢేబర్ యిలా అన్నారు:

"ఆంధ్రులు శక్తి సామర్థ్యాలకు, కష్టపడి పని చేయుటకు, పట్టుదలకు ప్రసిద్ధి. వారికి బాగా అభివృద్ధి పొందిన భాష, చక్కని వాఙ్మయము వున్నాయి. లలిత కళల పట్ల వారికి గల అభిమానం కూడా సుప్రసిద్ధమైనది. ఇంత గుణ సంపదతో, ప్రజల భౌతిక, నైతిక, మేధా, కళా ప్రమాణాలను హెచ్చించుటలో వారు చేయలేని పనంటూ లేదు".

## అన్నదాత

ఆంధ్ర ప్రదేశ్ గడచిన 3, 4 సంవత్సరాలలోను దేశం యితర ప్రాంతాల ఆహారావసరాలను యెడ తెగకుండా తీర్చి వాటికి చాలా వుపకారం చేసింది. కాబట్టి పరిశ్రమల కేటాయింపులో దానికి కొంత వార చూపాలి అని కేంద్ర హోం శాఖా మంత్రి పండిట్ జి. బి. పంత్ 25-10-58 న హైదరాబాదులో సనత్‌నగరంలో పారిశ్రామిక కేంద్రాన్ని ప్రారంభిస్తూ అన్నారు.

అది ఒకవిధంగా మిగిలిన దేశాన్ని పోషిస్తున్నది. ప్రాణావసరమైన ఆహారాన్ని సమకూరుస్తున్నదని ఆయన అన్నారు.

ఆయన యింకా యిలా అన్నారు: రాష్ట్రంలో భారీ నీటిపారుదల ప్రాజెక్టులలో కొన్ని వుపయోగించే దశకు వచ్చినందుకు నాకు సంతోషంగావుంది. నాగార్జునసాగర్ ప్రాజెక్టు పూర్తికావడంతో రాష్ట్రంలో ఆహారం, యితర పంటల వుత్పత్తి బాగా హెచ్చుగలదు."

## సాటిలేనిమేటి కళ

"ఆంధ్రుల కళాప్రభావం" పై 28-10-58 'స్టేట్సుమన్' పత్రికలో వ్రాస్తూ శ్రీ రుషికుమార్ సక్సేనా యిలా అన్నారు:

మౌర్యుల కళ యెక్కువగా ఆస్థానకళ, ఆ కారణంచేత అది వ్యక్తిగత ముద్రాంకితమైతే సంగ, ఆంధ్ర కళలలో యెక్కువగా ప్రజాహృదయం, సంప్రదాయాలు,సంస్కృతి ప్రతిబింబిస్తాయి. నిండైన జంతు విగ్రహాలు, వాటిలో వుట్టిపడే చైతన్యం, ఠీవి, సహజ సిద్ధమైన వాటి స్వరూపాలు మహోన్నతంగా అగపడి మనస్సులో హత్తుకుపోతాయి.

భార్హూట్, సాంచీ, అమరావతిలలోని వుబ్బెత్తు చిత్రాలు మళ్లీ సమకాలీన భారతీయ జీవితానికి వ్యాఖ్యాన దర్పణాలుగా వుంటాయి. సంగ, ఆంధ్ర కళల వస్తువు నేటికీ యెక్కువగా బౌద్ధానికి సంబంధించినదే, కాని మౌర్య కళలా కాక వాటిమూలం సామూహిక సాంఘిక అభిరుచులు, అభిప్రాయాలలో పాదుకొని వున్నది.

దక్షిణ భారతంలో కృష్ణా-గోదావరి బేసిన్‌లో ఆంధ్ర సామ్రాజ్యం మౌర్య సామ్రాజ్య విచ్ఛిత్తి జరిగిన అచిరకాలంలోనే తల యెత్తింది, కాని కళల చరిత్ర నిమిత్తం యీ రాజ్యకాలం సాధారణంగా రెండు విభాగాలుగా విభజించ బడుతుంది. మొదటి ఆంధ్ర (క్రీ. పూ. 72-25), తరువాతి ఆంధ్ర (కీ. పూ. 25 నుంచి క్రీ. శ. 4వ. శతాబ్దం వరకూ). మొదటి ఆంధ్రలో ప్రముఖమైన కళా ఖండాలలో దిగువ వాటిని పేర్కొనవచ్చు. సాంచిలో 1వ. మహాస్థూపానికి అదనంగా చేర్చ

బడిన సుందరమయిన నాలుగు శిల్పతోరణాలు (ద్వారాలు); శివ. స్థూపానికి అమర్చబడిన ఒక ద్వారం; జగ్గయ్యపేట స్థూపం పునర్బెత్తు చిత్రాలు. ఘంటసాల, నాగార్జునకొండ, గోలిలలో చుట్టూ గల మఠాలతో సహా శిథిలమైన మహా స్థూపాలు తరువాతి ఆంధ్ర కాలానికి చెందినవి. కాని తరువాతి ఆంధ్ర ఆలయాలన్నిటిలో మిక్కిలి ప్రసిద్ధమైనది అమరావతిలోని మహాస్థూపం.

భార్హూట్‌లోని మొదటి భారతీయ కళ సంప్రదాయాలు సాంచీ, అమరావతిలలో కొనసాగించబడినవి. సాంచీ తోరణంమీది యక్షకాంతలు భార్హూట్ స్త్రీ, చెట్టు భావాలకు ధైర్యమైన అనుకరణ. ఈ యక్ష స్త్రీ ప్రతిమలు ద్వారానికి అప్పగించేవు; కాని నిరాడంబరంగా అవి మలచబడ్డ విధానం వల్ల టీపి-స్పిరిట్‌ని అవి అద్భుతంగా ప్రదర్శిస్తాయి.

అమరావతి చిత్రాలు భార్హూట్ చిత్రాల కంటె లోతుగా మలచబడి, రేఖలు యెక్కువగా తీర్చబడినవి. మానవ విగ్రహాలు పొడుగ్గా, బక్కపలచగా వున్నాయి. కాని యీ రేఖలు సున్నితంగా వుండి యెక్కువ పూర్ణంగా, పూర్తిగా వున్న విగ్రహానికి లావణ్యాన్ని, చలనాన్ని, సౌకుమార్యాన్ని ప్రసాదిస్తాయి.

ఆంధ్ర పద్ధతిలో కొన్ని కుషాన్ ప్రభావాలు కూడావున్నాయి. నాగార్జున కొండనుంచి త్రవ్వబడిన నిల్చునివున్న బుద్ధుని విగ్రహం సరాసరి ముందుకు తిరిగి వుండుట, కుడిభుజం దిస్సగా వుండేట్టు సంఘాతి ధరించుట, అది పెద్దదిగా బరువుగా వుండుట, దాని దుస్తుల మడతలు, కుట్లను సూచించే లోపల కత్తిరింపు రేఖలు-యివన్నీ కుషాన్ విగ్రహాలను తలపిస్తాయి.

అమరావతి శిల్పులకు ఒకే చిత్ర-ఫలకంపై చాలా బొమ్మలను మలచడం ప్రీతి కరమేమో అనిపిస్తుంది. ఈ శిల్ప నిర్మాణం శిల్ప శాస్త్రం దృష్ట్యా కుషాన్ లేక భార్హూట్ కళకంటె క్లిష్టమైనది. భార్హూట్‌లో చిత్ర ఫలకాలలో జాతక కథలను వరుసగా చెప్పిన విధానమే అమరావతిలో కూడా కొనసాగించబడింది. కాని యివి సచల పుద్యమం పూర్ణ పద్ధతులుగా యేర్పరచ బడినవి.

అమరావతి విగ్రహాలలో పరిణతి చెందిన శిల్ప విన్యాణం, సహజత్వం గోచరిస్తాయి. అవి సమకాలీన భారతీయ శిల్పాలన్నిటికంటె సూక్ష్మంగా, సున్నితంగా వున్నాయి.

నాగార్జునకొండ, గోలిల శిల్పాలు అదే ఆంధ్ర స్కూలుకి చెందినవైనా క్రీ. శ. 2 వ. శతాబ్దం మధ్యకాలంలో అమరావతి అందుకొన్న స్థాయికి అరుదుగా అందుకున్నాయి. భార్హూట్, అమరావతిలమధ్య జీవితం వైఖరిలో మార్పు సహజమైన కళా వికాస చరిత్రనే కాక సాంఘిక-ఆర్థిక వ్యవస్థలో మార్పులను కూడా సూచిస్తుంది. కాబట్టి భార్హూట్, సాంచి శిల్పాలకు కారణ భూతులైన వారు గ్రామీణ, వ్యవసాయ నాగరికతను వ్యక్తీకరించి, జీవితానికి ప్రకృతితో తాదాత్మ్యాన్ని ప్రతిఫలింప చేశారు. జీవితంపట్ల ఆరోగ్య కరమైన ఆసక్తి, శాశ్వత విలువలకి ప్రాధాన్యం, ప్రశాంతంగా, కుదురుగావుండే బలంలో విశ్వాసం యివి వారి శిల్పంలో తొణికిసలాడుతాయి.

అయితే క్రీ. శ. 1వ. శతాబ్దం మధ్యలో అమరావతి, ధనిక రోమన్ వ్యాపార కేంద్రాలు యేర్పాటయిన ధనిక తూర్పు కోస్తారేవులకు దగ్గరగా వున్నందున, వ్యాపార సాంఘిక ఆర్థిక వైఖరిని ప్రతిబింబించ నారంభిస్తుంది. ఈణి కానందానికి, తాత్కాలిక విలువలకు ప్రాధాన్య మివ్వబడింది. అందుచేత అమరావతి పట్నవాసుల సమాజంలో పై తరగతి స్త్రీలు నాగను, కృత్రిమ అలంకారాలకై పారిసులాడే ప్రదర్శన ప్రియులుగా వున్నట్టు కనబడతారు. బాగా అభివృద్ధి చెంది హుషారుగా సచలనంగా వుండి జీవకళ తొణికిలాడే యీ తరువాతి ఆంధ్ర ప్లాస్టిక్ కళ సమకాలీన యితర భారతీయ కళలలో సాటిలేనిదై పల్లవులను, సిన్హాలీసును వుత్తేజపరచుటేకాక భారతీయ సంస్కృతీ జ్యోతిని జావా, కంబోడియా, ఇండో-చైనావంటి దేశాలకు కూడా కొనిపోయింది. కాబట్టి అమరావతి ప్రభావం అంకార్‌థోమ్, అంకార్‌వాట్ ఖ్మేర్ శిల్పాలలోను, బోరోబుదురు దేవాలయం శిల్పాలలోను ప్రతి ఫలిస్తే యెవరికీ ఆశ్చర్యం కలగదు.

# ఆంధ్రప్రదేశ్ పోలీసు బలం - పుట్టు పూర్వోత్తరాలు

(యం. కృష్ణమూర్తి, ఐ. పి. యస్. ఎ. ఐ. జి.)

ఇప్పటికి రెండేండ్లనాడు అనగా 1956 వ సం॥ నవంబరు నెల ఒకటవ తారీఖున ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించింది. సమిష్టి మద్రాసునుండి విడివచ్చిన ఆంధ్రరాష్ట్రమును అవిచ్ఛిన్న హైదరాబాదులోని తెనుగు సీమయును (తెలంగాణ) ఏకమై సుమారు 312 లక్షల జనాభాతోను, ఒకలక్ష చదరపు మైళ్ళ విస్తీర్ణంతోను ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పర్పడింది. దేశ కాలపరిస్థితులను అనుసరించి విడిపోయిన తెనుగువారు వివిధ సాంప్రదాయాలకు అలవడిన మూడుకోట్ల ఆంధ్రులు తిరిగి ఒకటైరి. ఆశయములందును, కార్యకలాపములందును ఏకమనస్కులైరి. ఉభయప్రాంతములందలి పరిపాలనా విధానములను అధికారవర్గాలను సమ్మిళింపవలసి వచ్చెను. రాష్ట్రంలో శాంతిభద్రతలందును, ఆజ్ఞ, అదుపు ఉంచుటకును, దండనీతిని అమలుపరచుటకును ప్రజాశ్రేయస్సే లక్ష్యంగాగల పురోగామి పథకములను, ప్రణాళికలను నిర్వహించడమందును అధికార అనధికార వర్గాలకు చేదోడుగా ఉండుటకై ఆంధ్రప్రదేశ్ పోలీసుశాఖ కృషిచేయుచున్నది. ఇట్టి శాఖయొక్క పుట్టు పూర్వోత్తరాలను, పరిణామములను, ప్రస్తుత స్థితియును, ప్రత్యేకత్వమును అతిస్థూలంగానైనా కొంతవరకు తెలుసుకోవలసియున్నది.

రాష్ట్ర నైసర్గిక స్వరూపాన్ని గూర్చియు, గ్రామీణ, పట్టణవాస జనాభాగురించియు, ఆర్థిక స్తోమత గూర్చియు వివరములను ఈ "ఆంధ్రప్రదేశ్" సంచికయందు వేరుగా ఎత్తివ్రాయడం పునరుక్తి యగును. కాని గమనించవలసిన కొన్ని ముఖ్య విషయాలను మాత్రం మనవిచేయుచున్నాను.

మన రాష్ట్రంలోని వెయ్యింటిప్రజలలో 673 మంది వ్యవసాయ జీవికులు ; 127 మంది వ్యవసాయేతర ఉత్పత్తి జీవికులు; 54 మంది వణిజులు; 14 మంది రవాణాలో ఉన్నారు. ఇవిగాక నౌకరీవృత్తిలో 132 మంది యున్నారు. గ్రామవాసులు 826 ఐతే, బస్తీలలో ఉండడం వ 174 మంది మాత్రమే. ఇంతకీ చదువునేర్చినవారు పరకవంతు అనగా 1/8 వంతు కూడా లేరు. ఇట్టి వ్యవస్థకు అనుగుణంగా రాష్ట్ర ధర్మ నిర్వహారణకై పోలీసుబలగం వినియోగింపబడుతున్నది. ఈనాటికి ఉన్న పోలీసుల సంఖ్య 34,044. అనగా వెయ్యినలబదిరెండు మంది ప్రజకు ఒక పోలీసు అన్నమాట. వర్తమాన రాష్ట్ర బడ్జెటులో రు. 529 లక్షలు పోలీసుశాఖకై కేటాయించబడిన state బడ్జెటు మొత్తములో ఇది 8.43% మాత్రమే. ఇదేప్రకారం తక్కిన రాష్ట్రాల అంచనాలు గమనించిన రాజస్థాన్‌లో 11.66%, పశ్చిమబెంగాల్‌లో 10.9%, బొంబాయిలో 10.02%, పంజాబులో 9.05% లు ఉన్నవి. ప్రస్తుత ఆర్థిక లోపంవల్లనేమి, ప్రణాళిక నిర్ణీత అంశాలకు ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వవలసినందుననేమి, ఆధునిక పంథాలో మన పోలీసుబలాన్ని ఇతోధిక శక్తివంతంగా చేయుటకు వీలులేకుండా ఉన్నది. కాని ఉన్న పరిస్థితిలోనే మన రాష్ట్రబలం మంచిపేరు తెచ్చుకొన్నది. యావద్భారతమునగల 14 రాష్ట్రాలలో 1956 వ సంవత్సరపు అంచనా ప్రకారం నేరములు జరగడంలో తక్కువగా 9 వ స్థానమును, వాటిని సాధించుటలో హెచ్చుగా రెండవ స్థానమును సంపాదించినది.

ఒకదినమునకు సరాసరి రెండు హత్యలు, ఒక దోపిడి, 20 కన్నపు నేరములు 37 సామాన్య చోరీలు, నాలుగు పశుహరణములు, నాలుగు దొమ్మికొట్లాటలు మన రాష్ట్రములో జరుగుతున్నవి. లక్షప్రజలకు సుమారు 120 ఘోరా నేరములు ఒక సంవత్స

రంలో జరిగినవి. ఐతే వాటిలో 60 నేరములు సాధింపబడినవి పైచెప్పిన ఘోరమైన నేరములుగాక ఇతర స్వల్ప నేరములకై తేనేమి, వివిధ శాసనములు ఉల్లంఘించినందువల్ల ఐతే ఏమి క్రిమినల్ కోర్టులకు ఎక్కిన వారు ఒక్క ఆంధ్రప్రాంతములోనే 1955 లో 360 875 మంది. ఇందు గమనించవలసిన విషయం ఏమిటంటే పిల్లలు, స్త్రీలు, వృద్ధులు వీరిని మినహాయిస్తే యుక్తవయస్సు వచ్చిన పురుషులలో వెయ్యింటికి 65 మంది ఏదో ఒక కారణాన క్రిమినల్ కోర్టులకు ఎక్కుతున్నారన్నమాట. అందులో ఏడుగురు శిక్షించబడినారు కూడాను. పై వివరములను అవగాహన చేసుకొన్నచో నేరములను అరికట్టడంలోను, ఆజ్ఞ అదుపు ఉండునట్లు చేయుటలోను పోలీసులకు ఎంతపని యున్నదో తెలుస్తుంది.

రాష్ట్ర అవతరణతో ఉభయప్రాంతాల పోలీసు సమ్మేళన ప్రారంభమైనది. ప్రారంభదశలో ఉన్న మంచి తెబ్బరలను గమనిస్తూ భిన్నసాంప్రదాయాలకు అలవాటుపడిన దళాలను ఒక త్రాటిపై నడిపిస్తూ, పై దళములలోని ప్రత్యేకత్వమును వృద్ధి పొందించవలసిన బాధ్యత పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ గారైన శ్రీ ఎ. కె. కె. నంబియార్, ఐ. పి. గారి వంతు ఐనది. గత రెండు సంవత్సరాలుగా వారి నిరంతర కృషిఫలితంగా చాలావరకు సిబ్బంది సమీకరణ పరస్పర సామరస్యత జరిగినది. మరియు పోలీసుబలమునకు బలీయమైన సాధన సంపత్తులను కల్పించిరి. ప్రజాసౌకర్యమునకు; అందుబాటునకు, రక్షణపటుత్వమునకు వీలగునట్లుగా దళ విన్యాసంలో మార్పులుచేసిరి. పూర్వపు హైదరాబాదుకు ఐ.జి. గా ఉండి ఇప్పుడు అదనపు ఐ.జి. గా ఉన్న శ్రీ శివకుమార్ లాల్, ఐ. పి. యస్. గారు పై కార్యములను సుస్థిరంగా జరిపించడమునందు వలసిన చేయూతను ఇచ్చిరి. పోలీసు శాఖామాత్యులు శ్రీ కె. వి. రంగారెడ్డిగారును, ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి గారును పోలీసు శాఖయొక్క అభివృద్ధికై ఎంతయో శ్రద్ధవహించిరి. ఐతే ఈ నూతన పోలీసు బలమును పర్యవేక్షణలో ఎదుర్కొనవలసివచ్చిన సమస్యలు ఏవో తెలుసుకొనుటకు సమ్మిళిత బలములయొక్క పూర్వపు పరిణామాలను సమీక్ష చేయవలసియున్నది.

## పోలీసులు-పూర్వ చరిత్ర

పురాణేతిహాసములలో వివరించిన శాంతి భద్రతలను అటుంచి, చారిత్రాత్మక రోజులలో ఉండిన పద్ధతులను గురించి అనేక గ్రంథాలు వివరించినవి. ఆంధ్ర విష్ణువు శ్రీకాకుళ నగరమును ఏలిన రోజులలోను, కాకతీయులు ఓరుగల్లును ఏలిన రోజులలోను విజయనగర సామ్రాజ్యపు రోజులలోను శాంతిభద్రతలకై అధిక కట్టుదిట్టములు ఉన్నట్లు చరిత్రవల్ల తెలియుచున్నది. కాని తదుపరి ఉత్తరాన మొగల్ సామ్రాజ్యం క్షీణదశకు వచ్చినపిమ్మట దక్షిణాపథమున పరిస్థితులు తారుమారుగా ఉండెను. ఒకవంక ఆంగ్లేయులు దేశంలో అక్కడక్కడ కుదురుకొనుచుండిరి. పదేపదే దేశాన్ని కొల్లగొట్టుచుండిన మహారాష్ట్ర దండులవల్ల, స్థానిక పాలేగార్ల లోపంవల్ల ప్రజలకు శాంతిలేకుండెను. బ్రిటిష్‌వారు ఆక్రమించిన ప్రదేశములలో కొంతవరకు శాంతి సమకూర్చుటకై పోలీసు దారోగాలను నియమించిరి. ఈ దారోగాలు ప 30, 40 మంది యా సాయుధ సిబ్బంది సహాయంతో 20 మైళ్ల ప్రాంతమునకు స్వతంత్ర అధికారమును చలాయించుచుండిరి. వీరికి వేతనములేదు. కాని పట్టుబడిన నేరస్థులకు ఇంత అనియు శిక్షపడ్డ నేరస్థులకు ఇంత అనియు బహుమానములు ఇచ్చుచుండిరి. కాని అచిరకాలంలోనే ఈ దారోగా పద్ధతిని మార్చి పూర్వముండిన గ్రామ సంరక్షణ పద్ధతినే బలపర్చవలసిందిగా నిర్ణయించిరి, 1832వ సంవత్సరంలో నియమించబడిన సెలెక్టు కమిటీ వారు కొన్ని మార్పులు సూచించిరి. కాని వాటిని అమలుపు తెచ్చుటకు ముందే 1857 సంవత్సరపు సంఘటనలు, అల్లకల్లోలాలు అడ్డుతగిలినవి.

1902–30 :–

తదుపరి 1860వ సంవత్సరంలో నియమించబడిన పోలీసు కమిషను మరికొన్ని సూచనలు చేసింది. వీటిని పట్టరీత్యా Indian Police Act. V. of 1861ను అమలులోకి తెచ్చారు. ఈవిధానమే కొద్ది

మార్పులతో యిప్పటికిని చలామణీఅగుచున్నది. ఆనాడు పైఉద్యోగస్థులందరు యూరపియన్లే ఉండవలెననియు, పోలీసు స్టేషన్లకు హెడ్‌కానిస్టేబుల్సు అధికారులుగా ఉండవలెననియు ఏర్పాటు ఉండెను. కానీ నిరక్షరాస్యులను, పరువు ప్రతిష్ఠలేని వారిని పోలీసు జవానులుగా చేర్చుకొని వారికి సరియైన యిష్టిక గ్రాసమునకు సరిపోని వేతనమునిచ్చి వ్యక్తి తరఫీదు నిరోధకశక్తులు వారిచేత పెట్టి ఊరుమీదకు పంపితే వారు దొంగలను పట్టే మంత్రాలన్నీ దొరల మీదికే ప్రయోగింప సాగించారు. వారిఅవినీతి, లంచగొండి తనము, హింసాకాండ ప్రజలకు పవగింపు కలిగించినవి. "అదిగో పోలీసు వచ్చె"అని పిల్లలను భయపెట్టసాగిరి. అప్పుడు కలిగినమచ్చ ఇప్పటికి యింకా మాసిపోవడంలేదు. పైకమీషన్‌వారి సూచనలలో ఈ విషయాలన్నీ వివరిస్తూ ప్రజలకు కష్టదాయకమే కాక రాజ్యాంగానికికూడా తలవంపులు కలిగిస్తున్న ఈ పద్ధతిలో మార్పులు అత్యవసరమని చెప్పారు. ముఖ్యమైన సూచన ఏమనగా నూతనంగా సంఘంలో పలుకుబడి, గౌరవం గడించగల అధికారి స్టేషన్‌కు యజమానిగా ఉండవలెనని సబిన్‌స్పెక్టర్ వర్గమును ఏర్పరచిరి. హెచ్. సి. సర్వవిధముల యస్. ఐ. కి సహాయ పడవలసిందే కాని స్వతంత్రించి కేసుల దర్యాప్తునకు పూనుకొనరాదనియు, జవానులు (I. CS.) గస్తీ, బీటు, గార్డు మున్నగు మామూలు డ్యూటీలకు తప్ప అంతకన్న జవాబుదారీ పనులకు పైఉద్యోగస్థుల అనుమతి లేనిదే పోరాదనిరి. జవానులను దాఖలు చేసికొనుటకు ముందు వారి నడవడిక గురించి విచారణ సలపవలెననిరి. పోలీసు బలగంలో సాయుధ శాఖను వేరుగాను, C.I.D. శాఖను వేరుగాను విడదీసిరి. 1905 సంవత్సరంలో సబిన్‌స్పెక్టర్ల శ్రేణికి యుక్తమైన నవయువకులను చేర్చికొనిరి. 1919వ సం. లో సెంట్రల్ఇంటలిజెన్స్ బ్యూరోను స్థాపించిరి. 1921వ సంవత్సరంలో కొన్ని ముఖ్యమైన మార్పులు చేసిరి. మలబార్ సాయుధబలము స్థాపించబడెను. సిబ్బంది వేతన సౌకర్యాలను పెంచించిరి. పట్టణ పోలీసులను Law order, Crime, Trafic అను మూడు శాఖలుగా విభజించిరి. వేలిముద్రలు గుర్తింపుకు C.I.D. లో ఒక శాఖను ఏర్పరచిరి.

1930-47 :-

ఈ కాలఖండములో చారిత్రాత్మకమగు మార్పులెన్నియో జరిగెను. మహాత్ముని శాసనోల్లంఘనము, ప్రపంచ సంగ్రామము, స్వరాజ్య సంపాదన, బ్రిటిష్ నిష్క్రమణ జరిగినవి, వీటినిగురించి వివరించుటగాని, ఈ సమయమందు పోలీసుశాఖ ఎట్లా నడచుకొన్నది చర్చించుట కాని ఇచ్చట అప్రస్తుతము. కాని అటు సేవావృత్తి, యిటు స్వాతంత్ర్యకాంక్ష ఆనాటి పోలీసులకు విషమ పరీక్షగా ఉండినను నేహధర్మమును జరిపిరి. ఈకాలంలోనే పోలీసు బలమునకు అంగముగా రేడియోశాఖను నెలకొల్పిరి ప్రత్యేక సాయుధశాఖను (S. A. I.) ఏర్పరచిరి.

1947-53 :-

స్వరాజ్య సంపాదనతో ఒక్కసారిగా 21 మంది I. P. Officers సమిష్టి మద్రాస్ రాష్ట్రమునుంచి విడిపోయిరి. మరి యిద్దరు పాకిస్థానుకు బదిలీ అయిరి. వారి స్థానములను క్రింది శ్రేణులనుంచి తాత్కాలికముగా పూరింపవలసి వచ్చెను. నూతనముగా T. P. S. వర్గమును ఆరంభించిరి. ప్రభుత్వము ప్రజాస్వామికంగా మారడంతోటే, పోలీసులు తమ దృక్పథాన్ని తదనుగుణ్యంగా మార్చుకోగలిగారు. కానీ అటు ప్రజకాని యిటు అధికార వర్గములుకాని ఈ నూతన వికాస చైతన్యమును అవగాహనం చేసుకొనుటకు కొంతకాలము పట్టినది.

ఇంతకు పూర్వము ప్రత్యేక శాఖగానుండిన అగ్నిమాపకదళమును కూడా పోలీసుతో విలీనపరచిరి. పైదళముపై ఐ. జి. గారికి అధికారమిచ్చిరి. యిది ఇట్లాఉండగా, హైద్రాబాద్ సంస్థానంలో అలజడి సందర్భంలో అనేకమంది పోలీసు ఉద్యోగులు అటు తరలింపబడిరి.

## ఆంధ్ర పోలీసు దళము

సమిష్టి మద్రాసు రాష్ట్రమునుండి వేరుపడి ప్రత్యేకముగా ఆంధ్రరాష్ట్రము 1953 అక్టోబరు

ఒకటివ తేదీన రూపొందినది. ఈ విభజనలో ఆస్తి పాస్తుల పంపకము సౌహార్దయంగానే జరిగెను. రాష్ట్రకేంద్రమగు కర్నూలుకు ఉండవలసిన స్థానములలో ఐ. జి. తో సహా 12 మంది గెజిటెడ్ ఆఫీసర్లు నియమింపబడిరి. మొత్తం ఆంధ్రపోలీసు బలం 16,452. యిదికాక S. A. P. 2 Battalions (అనగా 2,560 మంది) ఆంధ్రకు కేటాయించబడెను. మద్రాసు నుంచి విడి వచ్చిన తరువాత అనంతపూర్ లో ప్రత్యేక శిక్షణా కళాశాలను స్థాపింపవలసి వచ్చెను. సంక్షిప్తలేఖన శాఖ కూడా ఏర్పడెను. ఈ కాలములో ఎన్నియో రాజకీయ సాంఘిక ఉద్రేకములను పోలీసు శాఖ ఎదుర్కొనవలసి వచ్చెను. ఈ ఘట్టములో ముఖ్యముగా పేర్కొనవలసిన విషయము మద్య నిషేధ నిర్వహణ Excise శాఖ నుంచి పోలీసు శాఖకు తరలింపబడుటయే. అందువల్ల Excise శాఖ ఉద్యోగులలో చాలామందిని పోలీసు బలములోనే చేర్చుకోవలసి వచ్చెను. ఈ మద్యనిషేధమును తీవ్రంగా అమలు పర్చడానికి వీలుగా జిల్లా, జిల్లాను ఎక్కువ పోలీసు స్టేషన్లను, ఎక్కువ సర్కిల్ ఆఫీసులును. నూతన సబ్ డివిజనులు ఏర్పరచబడెను. ఈ సంక్రమణచే కొంతవరకు పోలీసు సిబ్బందిలో అవినీతి పెరుగుటకు అవకాశం కలిగింది. కానీ పై ఉద్యోగస్తులు వెయ్యి కళ్ళతో కనిపెడుతూ తీవ్రంగా క్రమ శిక్షణచే అదుపులో పెట్టుచున్నారు. ప్రజా సహకారం పూర్తిగా లేనందునను, మద్య విక్రేతలు పన్నే పన్నుగడలవల్ల ద్రవ్యం వెదజల్లి ఆశ పెట్టడం వల్లను ప్రస్తుతపు పోలీసు డ్యూటీలలో ఈ డ్యూటీ బహు కష్టతరమైనది. అయినసూ సర్వ శక్తులా సాధించుచునే ఉన్నారు.

## హైదరాబాద్ పోలీస్

ఇక హైద్రాబాద్ పోలీసు బలముయొక్క పుట్టుపూర్వోత్తరాలు చెప్పవలసియున్నది. హైద్రాబాద్ సంస్థానములో ఆధునిక పరిపాలనా పద్ధతికి 1869 వ సంవత్సరంలో ముఖ్య మంత్రిగా ఉండిన శ్రీ సాలార్ జంగుగారిచే అంకురార్పణ చేయబడెను. ఆయన పోలీసు దళమును ఏర్పరచి మంత్రాంగములో "సదరుల్ మామ్" పద్ధతిని కల్పించిరి. అప్పుడు మూడు విధములైన పోలీసులుండిరి. "సర్ఫేఖాస్, దివానీ, పైగా అండ్ జాగీర్," యిది కాక హైదరాబాద్ పట్టణ పోలీసు ప్రత్యేకముగా ఒక "కొత్వాల్" అధీనమునందు ఉండెను. అప్పటి నగర వైశాల్యము 2-1/2 చదరపు మైళ్ళు. జనాభా 1,23,675, నగర పోలీసులు 1,487 మంది. నగర పరిసర ప్రాంతములకు అనగా, 19-1/2 చదరపు మైళ్ళ విస్తీర్ణమునకు ప్రత్యేక పోలీసు ఉండెను. యిక జిల్లాలలో సరైన పోలీసు లేకుండెను. ప్రతి తాలూకాదారునకు ఒకటి, రెండు వందల సిపాయీలను మద్దతుగా యిచ్చిరి. వీరిని రోహిల్లా మూకలను అరికట్టుటకు వినియోగించుచుండిరి. 1274 వ ఫసలీలో జిల్లాలలో కూడా ప్రత్యేక పోలీసు ఏర్పరచబడెను. ఒక "సదర్ మొహతిమిం కొత్వాలి". అతనికి సహాయకులుగా 5 మంది "నాయబ్ సదర్ మొహతిమిమ్‌లు" నియమించబడిరి. అప్పటి పోలీసు అధికారులకు జవానులను శిక్షించుటలో రూ. 300 వరకు అపరాధం వేయుటకును, ఒక సంవత్సరం జైలు వేయుటకును అనుమతి ఉండెను. స్టేషను ఆఫీసు మొదలు సదర్ మొహతిమిమ్ వరకు అంగ రక్షక ఏర్పాటు ఉండెను. ఒక "జౌకు" అనగా ఒక జమేదార్ లేక దఫేదార్, 13 మంది జవానులు. ఐ. జి. గారి వెంట ఒకటిన్నర "జౌకు" సిబ్బంది; ఆఫీసు వెంట అర "జౌకు" సిబ్బందియు కాపలా ఉండెడివారు. అప్పటిలో హైదరాబాదులో 583 మంది ప్రజకు ఒక పోలీసు ఉండెను. అదే సమయంలో మద్రాసులో 1479 మందికి ఒక పోలీసు ఉండెడివాడు. గమనించవలసిన విషయమేమంటే 1898 రిపోర్టు ప్రకారం పోలీసు బలం 13555. ఇందులో మహమ్మదీయులు 12040, హిందువులు 2439 మంది ఉండిరి. ఈ విషయమై హైదరాబాదులో 22-1/2 సంవత్సరాలు ఐ. జి. గా పని చేసిన శ్రీ హంకిన్ తమ సాలీన నివేదికలో ఒకటి రెండు పర్యాయములు నొచ్చుకొన్నను పాలక వర్గం తమ పంథాను మార్చుకొనలేదు. ఇంచు మించు ఈ పద్ధతే కడవరకు నిలిచిపోయినది. శ్రీ హంకిన్సు వారు 1887 నుండి 1919 సంవత్స

రాంతం వరకు ఐ. జి. గా పని చేసిరి. వారి నిరంతర కృషియే హైదరాబాదు పోలీసుకు పునాది. జవానుల జీతములను హెచ్చించిరి. అంతకు పూర్వం వున్న "ఆప్ లక్ ఖానా" లలో ఉండిన భాగాలను మానిపించి 259 పోలీసు స్టేషనులను కట్టించిరి. దోపిడీ నేరములు తీవ్రంగా జరుగుతున్న సంఘటనలను సర్వ శక్తులు వినియోగించి అల్లరి మూకలను అదుపులోకి తెచ్చిరి. ఆ వెనుకటి వారిలో పేర్కొనతగినవారు శ్రీ హాలిన్సు (1935 to 41) వారి కాలంలో అంబరు పేటలో 82 ఎకరాల భూమిని వశ పరచుకొని సి. పి. యల్. ను కట్టించిరి. వారు ఉత్తర ప్రదేశ్ నుండి వచ్చిన ఆఫీసరు ఐనందు వల్ల ఆ సాంప్రదాయక పోలీసు మాన్యుయల్ ఒకదానిని వ్రాసిరి. వారు ఉద్యోగంవిరమించిన తరువాత "The ten commandments" అని వ్రాసిన పుస్తకంలో హైదరాబాదు పోలీసులను గురించియు, నేరముల గురించియు, వివరిస్తూ తదితర బ్రిటిష్ ప్రాంతాలలోకన్న హైదరాబాదులో నేరములు చాలా తక్కువగా జరుగుతున్నవని పేర్కొనిరి. కారణమేమున ప్రజలు అంత తీవ్రులు కారు; పారిశ్రామిక పట్టణములులేవు; బయటనుండి దొంగ ముఠాలు హైదరాబాదులోనికి రా వీలులేదు. పైగా నిజాంగారి పెత్తనం పితృవాత్సల్యముతో కూడి ఉన్నదని వ్రాసిరి. మరియు ఒక విధానమునందు మాత్రం తమ ఏవగింపును సూచించిరి. 1323 వ ఫసలీలో ఉరిశిక్షను రద్దుపరచి, మారుగా 20 సంవత్సరముల ఖైదును నిర్ణయించిరి. అప్పటి లగాయతు హానీలు జాస్తిగా అవుతున్నాయని వారు వాక్రుచ్చారు. ఇక హైద్రాబాదులోని స్వరాజ్యకాంక్షా ఉద్యమము, ఇత్తెహాదుల్ ముస్లిమిన్ ల ఆర్భాటము, తెలంగాణా సీమలోని సాయుధ దళముల దౌర్జన్య స్వైర విహారము మొన్న మొన్న జరిగిన సంఘటనలే. వీటినిగురించి వేరుగా చెప్పనవసరంలేదు. పరిస్థితులు తారుమారయ్యేను. కాని క్రమేపీ అశాంతి తగ్గినది. గ్రామాలనుండి తరలివచ్చిన పటేళ్ళు మున్నగువారు తిరిగి స్వగ్రామాలకు చేరుకొనిరి. 1955 వ సంవత్సరంలో అప్పటి ఐ. జి. గా ఉండిన శ్రీ శివకుమార్ లాల్ గారు "పోలీసు విలేజ్ స్కీము" ను ప్రారంభించి స్వల్పకాలములోనే జిల్లాకు కొన్ని కేంద్రములను ఏర్పరచిరి. ఈ స్కీము ప్రకారం పోలీసులు వారి శ్రమదానమిచ్చి గ్రామ అభ్యున్నతికి తోడ్పడుచుండిరి. మందిరములు కట్టడం, రోడ్లు వేయడం మొదలగు పనులను చేయపూనుకొనిరి. యిదికాక హైద్రాబాదు పట్టణములో క్రీడా కేంద్రముగా ఒక స్టేడియమ్ నిర్మాణమునకు పునాది వేసిరి. ప్రభుత్వ ధనసహాయముతో పోలీసు బలముయొక్క శ్రమదానమును జతపరచి పని సాగించిరి. ఒక ఏడాది క్రిందట యిది ఆవిష్కరించబడినది. ఒక్కమారుగా వేలాదివేల ప్రేక్షకులు కూర్చుండుటకు వీలుగా సోపానపంక్తులు గలవు. యిట్టి చర్యలవల్ల పోలీసులకు, ప్రజలకు సామరస్యము, సన్నిహితమెలయిక కలిగినది.

పై పరిస్థితులిట్లు ఉండ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ప్రకారం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ 1956 వ సంవత్సరం నవంబరు నెల ఒకటవ తేదీన జరిగినది. ఆనాడు ఆంధ్రప్రదేశ్ పోలీసుకూడా ఏర్పడెను. అవతరణోత్సవమునకై వేలాది జనులు, ప్రముఖ నాయకులు, అధికారులు తండోపతండములుగా హైద్రాబాదునకు వచ్చిరి. మైసూరు, బొంబాయి రాష్ట్రములకు కేటాయింపబడిన పోలీసు ఉద్యోగులు తరలిపోయిరి. కర్నూలునుండి ఆంధ్ర ఉద్యోగులు హైద్రాబాదుకు వచ్చిరి. నూతనవికాసంతో కార్యకలాపాలు జరగనారంభించాయి. ఆనాటినుండి ఆంధ్ర, తెలంగాణా పోలీసుల కలయికచే ఆంధ్రప్రదేశ్ పోలీసుగా మార్పడమైనది. అప్పట్లో ఈ రెండు ప్రాంతములందు ఉండిన పోలీసు బలాబలములను, సమీకరణానంతరము ఇప్పటికి (30-6-1958కి) ఉన్న పరిస్థితులను ఈక్రింది పట్టికలో సూచింపబడినవి.

| | 1—11—1956 | | 30—6—1958 | |
|---|---|---|---|---|
| | ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్ర | తెలంగాణా |
| (1). సివిల్ పోలీసు బలం : | | | | |
| సబ్ డివిజన్లు | 44 | 31 | 44 | 32 |
| సర్కిళ్లు | 120 | 68 | 120 | 72 |
| పోలీసు స్టేషన్లు | 565 | 298 | 566 | 305 |
| పోలీసు నాకాలు | 104 | 71 | 112 | 84 |
| గెజిటెడ్ ఆఫీసర్లు | 97 | 65 | 102 | 67 |
| నాన్ గెజిటెడ్ ఆఫీసర్లు | 1,402 | 716 | 1,312 | 781 |
| కానిస్టేబుల్సు | 22,745 | 19,213 | 21,809 | 17,227 |
| (2) సాయుధ పోలీసు బలం : | | | | |
| గెజిటెడ్ ఆఫీసర్లు | 11 | 10 | 10 | 10 |
| నాన్ గెజిటెడ్ ఆఫీసర్లు | 103 | 88 | 84 | 84 |
| సిబ్బంది | 2,954 | 2,512 | 2,324 | 2,312 |
| బెటాలియన్లు | 2 | 2 | 2 | 2 |
| యస్. ఎ. ఆర్.; సి. పి. యల్. | — | 2-28-1049 | — | 2-20-1054 |

ఆవశ్యకత, ఉపయోగ విధానం దృష్ట్యా బల విన్యాసములలో మార్పులు జరిగినవి. ఈ మార్పులు చేయడంలో ముఖ్యంగా ప్రజా సౌకర్యము, రాకపోకలకు గల వసతి, స్థానిక పరిస్థితులు, నేరముల గరిష్ఠము, పోలీసులు చేయవలసిన కార్యాంశములు మొదలగు వివిధ విషయములను అతి జాగ్రత్తగా పరిశీలించిన పిమ్మటనే చేయడమైనది. ఈ సవరణల వల్ల మిగల్చ గలిగిన రూ 10 లక్షలను పోలీసు శాఖ అభివృద్ధికై అత్యవసర సాధన సంపత్తిని కూర్చుటకును, శాస్త్రీయ విజ్ఞాన రీత్యా నేరాన్వేషణకు ఉపకరించు యంత్ర సామగ్రి కొనుటకును ఉపయోగింప బడినది.

## చట్టముల ఏకీకరణ విధానము :-

యావత్ భారతమునకు వర్తించు Indian Penal Code; Criminal Proceedure Code; Evidence Act మొదలగు కేంద్ర చట్టములే కాక యిటు హైద్రాబాద్‌లోను, అటు ఆంధ్రలోను అమలులో నుండిన రాష్ట్రీ చట్టము లెన్నియో కలవు. వాటిలో దాదాపు ముప్పదికి పైగా పోలీసులకు సంబంధించినవి ఉన్నవి. ఈ స్థానిక చట్టములన్నీ అయా సీమలకు వర్తించును. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము ప్రత్యేక చట్టములను శాసించు నంతవరకు పై స్థానిక చట్టములు అమలులో ఉండును. ఒకే విషయమునుగూర్చి రెండు విధము లుగా అనుష్ఠింప వలసి వచ్చినది. మద్య నిషేధ చట్టము ఆంధ్ర ప్రాంతాలకు వర్తించును కాని తెలంగాణాకు వర్తించదు. యిక్కడ ప్రతి చిన్నవిషయంలో కూడా ఆచరణవిధాన భేధము లెన్నియో కలవు. యిటు తెలంగాణాలో వ్యావహారిక భాష ఉర్దూ, అటు ఆంధ్రలో యింగ్లీషు, తెలుగు. అన్ని కార్యాలయములలోను కేవలం ఉర్దూ జ్ఞానము మాత్రమే కలవారు ఉండిపోబట్టి వారి ప్రయోజకత్వము మూరిన పరిస్థితులలో సన్నగిల్లినది. సిబ్బందీల జీత భత్యము లందును, వారికి అన్వర్తించే సర్వీసు రూల్సులోను భేదములే ఉన్నవి. ఏమార్పు చేయ చూచినను యిటు తెలంగాణా వారో, అటు ఆంధ్ర వారో తమకు అన్యాయం జరుగునేమో నన్న అపోహ కలిగి ఉండుటచే ముందు వెనుకలు తీవ్రంగా ఆలోచించియే చేయవలసి వచ్చెను. ప్రభుత్వంవారు ఈ పోకలను కనిపెట్టి సకాలమునకు యుక్త చర్యలు జరిపించడం వల్లను, శాఖాధికారులు అతి జాగరూకతతోను, నిష్పక్షపాతముతోను వ్యవహరించడం వల్లను చాలా వరకు సౌహార్ద్యంగానే పనులు సాగిపోయినవి.

## ముఖ్యమైన మార్పులు :-

గత రెండు సంవత్సరములలోగా చేసిన అభివృద్ధికరమైన మార్పులలో ఈ క్రిందివి ముఖ్యాంశములు :

1. హైద్రాబాద్ పట్టణ పోలీసు బల విన్యాసమును సవరించి, నేరము లన్వేషించు శాఖయందు మార్పులు చేసిరి. ప్రజానీకానికి పోలీసు సహాయం అందుబాటులో నుండుటకై "కంట్రోలు రూము"ను ఫతేమైదానములో స్థాపించిరి. బండ్ల రాకపోకల సమ్మర్దము తొలగించుటకును, పాదచారులకు ప్రమాదము లేకుండుటకును అవసర మార్పులు చేయుచూ, ట్రాఫిక్ బ్రాంచికి అదనంగా ఒక అసిస్టెంట్ కమీషనర్‌ను నియమించడ మైనది.

2. నేరత్రోవను త్రొక్కిన పిన్న వయస్కులను కనిపెట్టి, వారికి తగు సహాయం చేసి, దుస్సాంగత్యం తొలగించి మంచి త్రోవను త్రొక్కించుటకు ఒక "Juvenile Aid Bureau" స్థాపించ బడెను. అందుకై నియోగించ బడిన డిప్యూటీ సూపరింటెండెంటు ఇప్పుడు బొంబాయిలో టాటా వారి సాంఘిక శాస్త్ర కళాశాలలో ఆరు మాసముల తర్ఫీదు పొందుచున్నారు.

3. పోలీసు సిబ్బందికి వారానికి ఒక్కరోజు విశ్రాంతికై విడి దినముగా ఇవ్వటమో, అట్లా ఇవ్వక పోయిన పరిహారముగా ఒక రూపాయి బత్తా యివ్వటము అన్న పద్ధతి ఆంధ్రలో మున్నది. దానిని తెలంగాణా సిబ్బందికి కూడా కలిగించడ మైనది.

4. జిల్లాల్లోని పోలీసు బలములను అవసరమైన మార్పులు చేసి-జిల్లా సాయుధ వర్గములని-యితోధిక శక్తి వంతములుగా చేయడమైనది.

5. హైద్రాబాద్‌లోని పోలీసు ట్రాన్స్‌పోర్టు కర్మాగారములో ఎక్కువ వసతులు కలిగించి, సదరు కర్మాగార అధికారి యైన Transport Officer యొక్క హోదాను డిప్యూటీ సూపరింటెండెంటుగా పెంచడ మైనది.

6. పోలీసు రేడియో శాఖను అభివృద్ధిపరచి, కనీసం ప్రతి సబ్‌డివిజన్ కేంద్రమునకు ఒక రేడియో సెట్‌ను ఇప్పించ వలెనను లక్ష్యం కలదు.

7. హైద్రాబాద్‌లో ప్రత్యేక శాఖగా ఉండిన అవినీతి నిర్మూలన శాఖను. (Anti Corruption Department) ఆంధ్రలో ఉండిన "× Branch"

తో జోడించి ఐ. జి. పి. వారి అధ్వర్యము క్రిందకు తేవడ మైనది.

8. హైదారాబాద్‌లో ప్రత్యేక శాఖగా ఉండిన అగ్నిమాపక దళమును ఆంధ్రలో పోలీసు అధీనములో ఉండిన అగ్నిమాపక దళమునకు జోడించి ఆ శాఖను I. G. P. అధ్వర్యం క్రిందకు తేవడ మైనది. ప్రతి మున్సిపాలిటీకి ఒక అగ్నిమాపక జట్టు ఉండవలెనను నదియే ఆశయము. నూతనముగా మూడు కేంద్రములలో జట్టులు స్థాపింప బడెను.

9. నేరాన్వేషణము నవీన పద్ధతులలో సాగించడానికిన్ని, పోలీసు విజ్ఞానాన్ని పునశ్చరణ చేయడానికిన్ని వీలగు నట్లుగా హైదారాబాద్‌లో ఆరు వారముల పాటు Refreher course ఏర్పాటు చేసి సబ్‌డివిజనల్ ఆఫీసర్సుకు, ఇన్‌స్పెక్టర్సుకు, సబిన్‌స్పెక్టర్సుకు జట్లు, జట్లుగా శిక్షణ జరుగుచున్నది. ప్రస్తుతము ఆరవజట్టు శిక్షణలో నున్నది.

10. C. I. D. కి ఉపశాఖగా పోలీసు పరిశోధనా కేంద్రము (Research Centre) ఒకటి స్థాపించబడెను. ఈ కేంద్రములో నేరస్థుల చరిత్ర; నేరములు చేయు విధానము మొదలైన విషయాలన్నీ క్రోడీకరించి అన్వేషకులకు ఉపయోగ కరమైన సూచనలు ఇవ్వటమే ఈ కేంద్రముయొక్క ఆశయము.

11. శాస్త్రీయ విజ్ఞానము ఆధునిక నేరాన్వేషణకు ఎంతయో అవసరమని గుర్తించి C. I. D. లో ఒక ఉపశాఖగా ఒక Scientific Branch ని ఏర్పాటు చేయడమైనది. దీనికి వలసిన ప్రయోగ సామగ్రిని సరఫరా చేయడ మైనది.

12. తక్కువ జీతగాళ్లగు పోలీసు సిబ్బందికి విశ్రాంతి విహారములకు సదుపాయము కలిగించడమే కాకుండా, కొన్ని కేంద్రములందు వారి పిల్లలకు ఉచితముగా పాలు ఇప్పించుటకున్ను, వారి ఆడు వారికి చేతిపనులు నేర్పించుటకున్నూ, కుట్టు పని అభ్యసింప వసతియును కలిగించడమైనది. అంబర పేటలో పోలీసు పిల్లలకు గాను రెండు పాఠశాలలున్నవి. యిందు 86 మంది పిల్లలకు భోజన వసతి కలదు. వీరందరు వసతి గృహములోనే ఉన్నారు.

ఇంతవరకు ఆంధ్ర ప్రదేశ్ పోలీసుల యొక్క పుట్టు పూర్వోత్తరాల స్థితి గతులు వివరించాను. ప్రజా శ్రేయస్సే లక్ష్యంగా గల రాజ్యాంగంలోని పోలీసు బలము, ప్రజా సేవయే పరమావధిగా తలచుచున్నది. "ఇదిగో బూచి, అదిగో పోలీసు" అని పిల్లలను భయపెట్టే రోజులు పోయినవి. అవినీతి పరులని, రాక్షసులని, కింకరులని ఏవగించుకొన్న రోజులు పోయినవి. పోలీసులు ప్రజలయొక్క సౌఖ్యమును, ఆమోదమును, సహకారమును ఆశిస్తున్నారు. శ్రీ D. J. Kharve గారు ఈ సందర్భంలో "Citizens should shed their fear complex and officers their superior airs and both respect law" అన్నారు. కాన ఈ బాధ్యత ఉభయత్ర ఉన్నదని మనవి చేస్తున్నాను.



# పొదుపు

రచన: బి. జాన్

చేయరా పొదుపును ఓరన్నా !
దాయరా ధనమ్మును రైతన్నా !!

వ్యర్థ ఖర్చులుమాని
శ్రద్ధబూనియునీవు
కొద్దిపైకమునైన
సద్దుగా దాచుకొని
హద్దుగా కాపురము ఓరన్నా !
దిద్దుకో బాగుగా రైతన్నా !!

దీపమున్నప్పుడే
దిద్దుకున్నట్టుగా
ఓపికున్నప్పుడే
దాపరికముచేయ
ఆపద సమయాన ఓరన్నా !
అడ్డుపడునీడబ్బు రైతన్నా !!

నిలువ జేసినయట్టి
విలువైన నీడబ్బు
విలువగల నగలకు
శిలుకువస్త్రాలకు
వెచ్చించబోకురా ఓరన్నా !
హెచ్చుమోసముగలుగు రైతన్నా !!

నగలు నాణెములున్న
పగలు రాత్రుల్లోన
దగాకోరులవలన
దొంగవాళ్లవలన
ధనమానప్రాణములకోరన్నా !
హాని తప్పకకలుగు రైతన్నా !!

హెచ్చువడ్డీలకై
పేరాశ పడబోకు
రచ్చకెక్కియునీవు
రభసపాలౌతావు
ఆశపడువారికి ఓరన్నా !
మోసంబుగలుగును రైతన్నా !!

దాచిన ధనముతో
పేచీలురాకుండ
నేషనలు సేవింగ్సు
సర్టిఫికెటుకొని
దాచుకో భద్రముగ ఓరన్నా !
పేచీలు రావురా రైతన్నా !!

చిన్న మొత్తమునైన
పిన్నగా దాచిన
కొన్ని యేడులలోన
ఎన్నగా నీడబ్బు
మిన్నగా వడ్డీతో ఓరన్నా !
తిన్నగా పెరుగురా రైతన్నా !!

("పొదుపుపుద్యమం" బుర్రకథనుండి)

-:0-0:-

# ప్రభుత్వ ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్‌లో ఆహారోత్పత్తి ( తె* లేక ఉ* ) | 0.12 న.పై. |
| 2. | ఆంధ్రప్రదేశ్ పశు సంక్షేమం ( ఇ* లేక తె* లేక ఉ* | 0.12 న.పై. |
| 3. | ఆంధ్రప్రదేశ్ చేతి పనులు ( తె* లేక ఉ* ) | 0.12 న.పై. |
| 4. | ఆంధ్రప్రదేశ్‌లో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ( ఉ* ) | 0.12 న.పై. |
| 5. | ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన సంక్షేమం ( తె* లేక ఉ* ) | 0.12 న.పై. |
| 6. | ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు ( ఉ* ) | 0.12 న.పై. |
| 7. | హైదరాబాదు నగర, శివార్ల - గైడ్ - ( ఇ* ) | 0.50 న.పై. |
| 8. | హైదరాబాదు నగరం పటం | 0.12 న.పై. |
| 9. | ఆంధ్రప్రదేశ్ ఖనిజ సంపద ( ఇ* ) | 0.25 న.పై. |
| 10. | ఆంధ్రప్రదేశ్ మత్స్యసంపద ( ఇ* లేక తె* ) | 0.12 న.పై. |
| 11. | ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయమైన స్థలాలు ( ఇ* ) | 0.12 న.పై. |
| 12. | ఆంధ్రప్రదేశ్ స్థూల స్వరూపం (ఆంధ్రప్రదేశ్ యెట్ యెగ్లాన్స్) ( ఇ* ) | 0.12 న.పై. |
| 13 | నూతన గ్రామాల నిర్మాణం-ఆంధ్రప్రదేశ్‌లో సమాజాభివృద్ధి ( ఇ* ) | 0.12 న.పై |
| 14. | ఆంధ్రప్రదేశ్ — ధాన్యాగారం - ( ఇ* ) | 0.12 న.పై. |

గమనిక :— ఈ పుస్తకాలు ఖరీదు డబ్బు చేరగానే పంపబడతాయి.

*ఇ = ఇంగ్లీషు
*తె = తెలుగు
*ఉ = ఉర్దూ

ప్రతులకై
ప్రచురణల విభాగం, సమాచార,
పౌరసంబంధాల డైరెక్టరు కార్యాలయం,
హైదరాబాదు 1.
చిరునామాకు వ్రాయండి.

"నీ పరీక్ష మార్కులు ఎన్నడగినంత ఎక్కువగా లేవు, కాంతా, కాని నీ బడి దుస్తులు,

**టినోపాల్** వల్ల ఎల్లప్పుడూ మెరిసే తెల్లగా వుంటున్నవి గనుక, నీవు ప్యాస్ చేయబడ్డావు."



"టినోపాల్" జె. ఆర్. గెయిగి ఎస్.ఎ., బాలే, స్విట్జర్లాండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

నిర్మించువారు : సుహృద్ గెయిగి ప్రైవేట్ లిమిటెడ్, వాడి వాడి, బరోడా.

సోల్ డిస్ట్రిబ్యూటర్లు : సుహృద్ గెయిగి ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్, పి.ఒ. బాక్సు నం 965 బొంబాయి.

కొద్దిగా టినోపాల్ తెల్ల బట్టలను [illegible] చేయును.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటనరేట్లు

—★—

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 130 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శాతం రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10¾ × 8¼" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలు [illegible] మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన [illegible] నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, [illegible] క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహించబడుతుంది. అయినా మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో [illegible] ప్రకారం వేయవలసింది, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ [illegible] చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్

సమాచార, పౌరసంబంధముల శాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు దక్కన్ — 1.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42 912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |

సగటు వర్షపాతం

| | | |
|---|---|---|
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటిపారుదలను పొందిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కొళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 54 21 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15 5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్రీ రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | ... | రూ 175 37 కోట్లు |

1958-59 బడ్జెట్టు :

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రూ 63 66 కోట్లు |
| వ్యయం | ... | ,, 62 87 ,, |
| పెట్టుబడి ఖర్చు | ... | ,, 21.29 ,, |

భారత ప్రధాని పండిత జవహర్ లాల్ నెహ్రూ 25-10.58 న హైదరాబాదు అంబర్ పేటలో హైదరాబాదు పాలిటెక్నిక్ సంస్థకు శంకుస్థాపన చేశారు. ఆ సందర్భంలో సభలో ప్రధాని ప్రసంగిస్తున్న దృశ్యం.